# విశ్వకళ్యాణం -
# హిందూ సంఘటన



ప్రొఫెసర్ రాజేంద్రసింహ



సాహిత్యనికేతన్ ప్రచురణ

ప్రథమ ముద్రణ :
ప్రభవ జ్యేష్ఠ అచల ఏకాదశి
జూన్ 22, 1987

ప్రచురణ :
**సాహిత్య నికేతన్**
3-4-705/4,
నారాయణగూడ,
హైదరాబాద్-500 029.



ప్రతులకు :
**సాహిత్య నికేతన్**
3-4-852,
బర్కత్‌పురా,
హైదరాబాద్-500 027.

**సాహిత్య నికేతన్**
ఏలూరు రోడ్డు,
విజయవాడ-520 002.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడా,
హైదరాబాద్-500 029.

**మూల్యం : రూ. 3-00**

# ముందు మాట

ప్రొ. రాజేంద్ర సింహజీ రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ సర్ కార్యవాహ (General Secretary) బాధ్యతను గత కొద్దికాలం పాటు నిర్వహించారు. ప్రస్తుతం సహసర్ కార్యవాహ (Joint General Secretary) బాధ్యతను నిర్వహిస్తున్నారు. 1987 జనవరి, ఫిబ్రవరి నెలల్లో సర్ కార్యవాహగా ఆంధ్రప్రదేశ్‌ను పర్యటించి సంఘ శిశిర శిబిరాలలో పాల్గొన్నారు. అప్పుడు శిబిర సార్వజనికోత్సవాలలో, స్వయంసేవకుల ప్రత్యేక సమావేశాలలో వారు చేసిన ప్రసంగాలను పుస్తక రూపంలో వెలువరిస్తే ఉపయోగకరంగా ఉంటుందని పలువురు సూచించారు. ఆ సూచనమేరకు ప్రచురించిన ఈ చిన్న పుస్తకంలో ఆర్.యస్.యస్. సిద్ధాంతం కొన్ని ఉదాహరణలతో వివరించబడింది.

ఈ పుస్తక ప్రచురణకు అనుమతి ఇచ్చిన ప్రొ. రాజేంద్ర సింహజీకి, సహాయపడినవారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు.

ప్రభవ జ్యేష్ఠ అచల ఏకాదశి,<br>జూన్ 22, 1987<br>హైదరాబాదు.

—ప్రకాశకులు

# విషయ సూచిక

# దేశాభ్యుదయంకోసం హిందువులు

( సార్వజనికోత్సవ ప్రసంగం )

సంఘ్ కార్యమీనాడు దేశమంతా వ్యాపించింది. ప్రతి జిల్లాలో సంఘం పని ఉంది. దేశంలో నేడు 450 జిల్లాలున్నాయి. ఆ జిల్లాలు తాలూకాలుగా కొన్నిచోట్లా, బ్లాకులుగా మరి కొన్నిచోట్లా విభజించబడినాయి. అటువంటివి దేశం మొత్తంమీద 2,400 ఉన్నాయి. వాటిలో 2,300 ఖండాల్లో సంఘ్ కార్యక్రమాలు నిర్వహింపబడ్తున్నాయి. అంటే 95 శాతం ఖండాల్లో సంఘం పని జరుగుతున్నదని మనం చెప్పుకోవచ్చు. పదివేల కంటే ఎక్కువ జనాభా కల పట్టణాలన్నింటా సంఘ్ శాఖలు పనిచేస్తు న్నాయి. ఆటువంటి పట్టణాలు దేశంలో మూడువేలున్నాయి. దేశం మొత్తం మీద ఇరవైవేల శాఖలుంటే అందులో పదిహేడువేల శాఖలు చిన్న చిన్న గ్రామాలలోనే ఉన్నాయి. అరవై, అరవైరెండు సంవత్సరాలలో మనం ఈ అభివృద్ధిని సాధించాం. హిందూ సమాజం దీనిని అంగీకరించటమే అందుకు కారణం. ఈ పెద్ద దేశంలో సువ్యవస్థితమైన, సంఘటితమైన శక్తి సంఘమొక్కటే. కాని అయిదు లక్షల గ్రామాలున్న దేశంలో ఇరవై వేల శాఖలు పూర్తి లక్ష్యాన్ని సాధించలేవు. శాఖల సంఖ్య పెరగాలి. లక్ష్యసాధనకై మనం మనస్ఫూర్తిగా పనిచేయాలి.

ఈ మధ్యకాలం దాకా సంఘ్ గురించి వ్యతిరేకాత్మక ధోరణిలో అనేక విమర్శలు వ్యాఖ్యానాలు వినేవాళ్ళం. కాంగ్రెస్, కమ్యూనిస్ట్, జనతా

పార్టీల వారందరూ సంఘానికి వ్యతిరేకంగానే మాట్లాడేవారు. సంఘ్ చాలా సంకుచితమైందని, మతతత్వం ఉన్న సంస్థ అనీ ఆ విమర్శ. కానీ గత రెండు మూడు సంవత్సరాలలో ఇటువంటి వ్యతిరేకాత్మక విమర్శలు ఎక్కువగా వినపడటం లేదు. "మీకు రాజీవ్‌గాంధీకి మధ్య ఏమైన ఒడంబడిక కుదిరిసదా? సంఘాన్ని కాంగ్రెస్ నాయకులు అంతగా విమర్శించటంలే"దని చండీగఢ్‌లో పత్రికా విలేఖరులు నన్ను ప్రశ్నించారు. "రాజీవ్ గాంధీతోనే కాదు, చంద్రశేఖర్‌తో, చౌదరీ చరణ్‌సింగ్‌తో, కమ్యూనిస్టులతోకూడ ఒప్పందంకుదుర్చుకున్నా"మని హాస్యంగానేను సమాధానం చెప్పాను. నేడు సంఘానికి వ్యతిరేకంగా మాట్లాడటానికి ఎవరూ సాహసించటం లేదు. దీనికి కారణం ఒప్పందాలు కాదు. సంఘ్, హిందూ సమాజ్ ఒక్కటే అనే భావ మేర్పడటం, సంఘ్‌ను వ్యతిరేకించటమంటే హిందూ సమాజాన్ని వ్యతిరేకించటమే. ఈ విషయాన్ని రాజకీయ పక్షాలు గ్రహించాయి. హిందూ సమాజంనుంచి ఓట్లు కావాలి కదా! అందువలన సంఘ్‌ను ఎవ్వరూ విమర్శించటం లేదు.

సమైక్యత, ఏకాత్మతా భావాలను దేశం నలుమూలలా వ్యాప్తి చేయటానికి సంఘ్ కృషి చేస్తోంది. క్రమశిక్షణను పెంచటానికి కూడ సంఘ్ పనిచేస్తోంది. సమాజంలో పెద్దవాళ్లు చాలామంది చెప్తున్నట్లు నైతిక విలువలు పెరిగినప్పుడే దేశం ప్రగతి వైపు పయనిస్తుంది. నేడు సమైక్య భావం విషమ పరిస్థితుల నెదుర్కొంటున్నదనీ, విచ్ఛిన్నకర శక్తులు పెరుగుతున్నాయనీ, మన ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాల నాధారంగా సమైక్య భావాన్ని రూపొందించాలనీ, క్రమశిక్షణకు ప్రాధాన్యమివ్వాలనీ దేశంలో రాజకీయ నాయకులు చెప్తున్నమాటలే. అంటే సంఘ్ భావనలను అందరూ అంగీకరిస్తున్నారన్నమాట. సంఘ్ పై వ్యతిరేకాత్మక భావన

తగ్గటమేకాదు, సంఘ్ ఆలోచనలను యితరులుకూడ స్వీకరిస్తున్నారన్న మాట. అయితే మనమాశించే దానిలో ఇది చాలా కొద్దిమాత్రమే.

ఈనాడు దేశంలో వేర్పాటు వాదశక్తులు పెరుగుతున్నాయి. విచ్ఛిన్నకర ధోరణులు మితిమీరుతున్నాయి. కాశ్మీర్ ప్రాంతంలో హిందూ దేవాలయాలు విధ్వంసానికి గురవుతున్నాయి. మొగలాయిల పాలనలో, ఔరంగజేబు పాలనలో హిందూ దేవాలయాలు విధ్వంసానికి గురయ్యాయని మనం చదువుకున్నాం. కాని నేడు స్వదేశీ పరిపాలనలో 70 నుండి 75 వరకు దేవాలయాలు నాశనం చేయబడ్డాయని, విగ్రహాలు పడగొట్టబడ్డాయని విన్నప్పుడు, హిందువులు ఈ దేశంలో తలెత్తుకు తిరగగలరా, శాంతి యుత జీవనం కొనసాగించగలరా, అనిపిస్తుంది. దేశ విభజన జరిగి పాకిస్తాన్ విడిపోయినప్పటికీ, పాకిస్తాన్ జిందాబాద్ అనే నినాదాలు వినపడు తూనే ఉన్నాయి. హిందూ యాత్రికుల కారణంగా ఆ కాశ్మీర్ సుఖ సమృద్ధంగా ఉంది. అయినా కాశ్మీర్‌లో హిందూ కుక్కలు ఇక్కడ నుండి పోవాలని వినపడ్తోంది. ఈ విధంగా భారతదేశంలో వినపడటం సిగ్గుపడ వలసిన విషయం.

పంజాబ్ పరిస్థితి మనందరికీ తెలిసినదే. అకాలీదళ్ అధికారంలో కొంత కాలం ఉంది. అయితే అంతః కలహాల కారణంగా అధికారాన్ని కోల్పోయింది. అధికారంలోలేని రాజకీయ పార్టీలు ఉద్యమాలు నిర్వహించటం మామూలే. అకాలీదళ్ కూడ ఇలాగే ఉద్యమాన్ని ప్రారంభించింది. 1980 నుండి ఈ ఉద్యమం తీవ్రమైంది. మొదట్లో శాంతియుతంగా జరిగిన ఈ ఉద్యమం త్వరలోనే జార్నయిల్‌సింగ్ భింద్రన్‌వాలా హస్తగతమైంది. వేర్పాటు వాదులు, ఆతంకవాదులు (తీవ్రవాదులు) అందులో ప్రవేశించారు. దురదృష్టకరమైన విషయమేమిటంటే - ఈ సమస్యను ఇంకా రాజకీయ

సమస్యగానే మనం పరిగణిస్తున్నాము. నేడు పంజాబ్‌లో ప్రజలు చంపబడు తున్నారు. (అందుకు ప్రత్యేకించి బాధపడవలసిన పని లేదు. ఎందుకంటే ప్రజలు ప్రతిచోటా చంపబడుతున్నారు. కరీంనగర్, వరంగల్ జిల్లాలలో చంపబడుతూనే ఉన్నారు కదా! కొన్నిచోట్ల తమలో తాము పోట్లాడుకుని చంపుకుంటున్నారు. కాని అందువలన సమాజంలో భేదభావం ఓ అగాధం ఏర్పడటం లేదు. సమాజం విచ్ఛిన్నమయ్యే ప్రమాదంలేదు. కాని ప్రస్తుత పంజాబ్ పరిస్థితి వేరు.) సిక్కు సోదరులకు యితర హిందువులకు మధ్య అగాధం సృష్టించబడుతోంది. పసివాళ్ళు చంపబడుతున్నారు. కేశధారులైన సిక్కులుకూడ ఉద్యమకారులకు సహకరించకపోయినా, ఉద్యమాన్ని వ్యతిరేకించినా హింసకు గురవుతున్నారు: వాస్తవానికి వారు గురుభక్తులు కారు. గురువుయొక్క అనుచరులు కారు. నిర్దోషులైనవారిని, అమాయకులను చంపేవారిని సిక్కుమతంనుండి బహిష్కరించాలి. నేడు భయంకరమైన పరిస్థితిని మనం ఎదుర్కొంటున్నాం. పాకిస్థాన్‌తో చేతులు కలపటమంటే సిగ్గుపడాల్సిన విషయం. కాని పంజాబ్‌లో నేడు జరుగుతున్నదదే.

సంఘ్ ఈ విషయంలో ఏమి చేస్తోంది? అనే ప్రశ్న మీ మనస్సులలో తలెత్తవచ్చు.

సంఘ్ కార్యకర్తలకు పంజాబ్‌నుండి పారిపోవలసిన అవసరం లేదని చెప్పబడింది. అలా పారిపోవటంవలన మనకే నష్టం. పంజాబ్‌నుండి సిక్కేతర హిందువులు, దేశంలోని ఇతర ప్రాంతాలనుండి సిక్కులు పారిపోవటం చాలా తెలివితక్కువ పని. యితర ప్రాంతాలలోని సిక్కులరక్షణ ఆ ప్రాంతాల ప్రజల బాధ్యత, అలాగే పంజాబ్‌లోని యితర హిందువులను కాపాడవలసిన బాధ్యత తమపై ఉందని అచ్చట నివసిస్తున్న సిక్కులు గ్రహించాలి. అసలు మనదేశం వదలి ఎక్కడికి పారిపోగలం?

ఖలిస్థాన్ ఏర్పడినందున సమస్యా పరిష్కారం కాదు. పాకిస్థాన్ వేర్పాటువాద ఫలితంగానే ఏర్పడింది. అంతమాత్రాన ఆ సమస్యా పరిష్కారం కాలేదనే చెప్పాలిగా! ఎందుకంటే, పాకిస్తాన్ ఏర్పడిన ఫలితంగా మనం దానితో మూడుసార్లు యుద్ధం చేశాము. నాలుగోసారి యుద్ధానికి పాకిస్థాన్ సమాయత్తమౌతోంది. "న్యూక్లియర్ బాంబు"లను సిద్ధం చేసుకొంటోంది. అమెరికా నుంచి ఆయుధాలను దిగుమతి చేసుకుంటోంది. దానికి తోడు మన దేశంలో నివసించే ముస్లిమ్‌ల ప్రవర్తన అనుమానాస్పదంగా తయారు అయింది. వారు ఈ దేశ పౌరులు ప్రవర్తించవలసిన తీరులో ప్రవర్తించటం లేదు. అటువంటి సమయంలో అనుమానాలు రేకెత్తటం అసహజమేమీ కాదు. గణతంత్ర దినోత్సవం (రిపబ్లిక్ డే) జరుపుకొనని పౌరుడుంటాడా? ముస్లిమ్ నాయకులు రామజన్మభూమి విషయంలో చేసిన ప్రకటనలు మీకు తెలిసే ఉంటాయి. జనవరి 26 నాటి ఉత్సవాలను బహిష్కరించమని వారి అనుయాయులను కోరారు. అది వాస్తవానికి దేశద్రోహకరమైన విషయం. అందువలననే అనుమానాస్పదమైన దృష్టి ఏర్పడుతోంది. పాకిస్థాన్ ఏర్పడటంవలన ఏ ఒక్క సమస్యకు పరిష్కారం లభించలేదనే విషయం సుస్పష్టం. ఇదే విషయాన్ని ఖలిస్థాన్ విషయంలోకూడ మన సిక్కు సోదరులకు తెలియజెప్పాలి. ఖలిస్థాన్ ఏర్పాటు సమస్యలకు పరిష్కార మార్గం కాదు. పాకిస్థాన్‌తో యుద్ధం మొదలైనప్పుడల్లా ఖలిస్తాన్ అంటే పంజాబ్‌కే ముందు నష్టం వాటిల్లుతుంది. వేర్పాటుధోరణులవలన దేశానికి ఏమీ లాభం లేదనే విషయం స్పష్టం.

పంజాబ్ సమస్యా పరిష్కారానికై ప్రభుత్వం మీద ఒత్తిడి తేవాలి. పరిష్కారం పేరుతో ఎటువంటి పొరబాటు జరగకుండా చూడాలి. పోలీస్ అధికారులు గాని, ప్రభుత్వాధికారులుగాని ఏదైనా పొరబాటు చేస్తే వాళ్లపై కఠిన చర్య తీసుకోవాలి. అవసరమైతే పంజాబ్ రాష్ట్ర ప్రభుత్వాన్ని

రద్దు చేయాలి. దాని స్థానంలో కేంద్ర పాలనను అమలు చేయ్యాలి ఇంకా అవసరమైతే సైనిక చర్యను అమలు జరపాలి. దేశం ఛిన్నాభిన్నం కాకుండా ఎటువంటి చర్య తీసుకున్నా మంచిదే.

పాకిస్తాన్ ఏర్పాటు పేరుతో మొదటిసారి దేశ విభజన ఇంగ్లీషు వారి హయాంలోనే జరిగింది. అందుకు అంగీకరించి మననాయకులు చాలా పెద్ద పొరబాటు చేశారు. మళ్లీ మరొకసారి దేశ విభజన జరుగరాదు. దేశవిభజన జరుగకుండా ఉండడానికి సర్వస్వం అర్పించటానికి మనం సిద్ధమ్యే అందులకై సిక్కులను దేశభక్తులను యితర హిందువులను సమైక్య పరచి సభలు ఏర్పాటు చేస్తున్నాము. పంజాబ్ సమస్య ఒక్క పంజాబ్‌కే పరిమిత మయింది కాదు, యావద్భారత్ దేశసమస్య అది.

మిజోరామ్‌తో దేశానికి హానికరంగా కేంద్రం వ్యవహరించింది. మిజోరాం ప్రాంత జనాభా షుమారు నాలుగయిదు లక్షలు. క్రైస్తవ మిషనరీలు బాహాటంగా మతప్రచారం చేసి 90 శాతం ప్రజలను క్రైస్తవులుగా మార్చివేశారు. ఆ తరువాత వారిలో వేర్పాటు వాదాన్ని నింపటానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. మొదట స్వతంత్ర రాష్ట్రం రావాలంటూ ఉద్యమం ప్రారంభమైంది. వారి హింసాయుత చర్యలను మన సైన్యం అణచివేస్తే, లండన్‌లో తలదాచుకుంటున్న మిజోరాం విద్రోహకర శక్తుల నాయకుడు లాల్‌డెంగాతో మన ప్రధాని రాజీవ్‌గాంధీ ఒప్పందం కుదుర్చుకున్నారు. ఆ లాల్‌డెంగాను మిజోరామ్ ముఖ్యమంత్రిని చేశారు. రాజ్యాంగంలో 370వ అధికరణం క్రింద కాశ్మీర్ ప్రాంతానికిచ్చిన ప్రత్యేక ప్రతిపత్తి కంటే ఎక్కువ ప్రత్యేకస్థాయిని మిజోరామ్‌కిచ్చారు. కేంద్రంతో సంబంధం లేకుండానే మిజోరామ్ బర్మాతో, బంగ్లాదేశ్‌తో వ్యాపారం చేయవచ్చు. మిజోరామ్ శాసనసభ ఆమోదించకపోతే, కేంద్రం చేసిన

చట్టాలు కూడ అక్కడ చెల్లవని అంగీకరించారు. వేర్పాటువాద శక్తులకు అంతకంటె ప్రోత్సాహం మరెక్కడ లభిస్తుంది?

ముస్లిమ్ స్త్రీలకు వేరు చట్టం అవసరం అంటున్నారు. ముస్లిమ్‌లు ఇదే దేశంలో ఉంటున్నారు. ఈ దేశ పౌరులందరూ న్యాయం దృష్టిలో సమానులే. కాబట్టి అందరికి సమానమైన చట్టమే ఉండాలి. హిందూ స్త్రీకి ఉన్న సదుపాయం ముస్లిమ్ స్త్రీలకు కూడ ఉండాలి. కానీ విడాకుల విషయంలో, తదనంతరం స్త్రీకి యిచ్చే భరణం విషయంలో ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకురాబడటంతో ముస్లిమ్ స్త్రీలకొరకు ప్రత్యేక చట్టం తయారు చేయబడింది. పూజా పద్ధతి వేరు కాబట్టి వేరే చట్టం అవసరమని వాదిస్తే దేశంలో చాలా చట్టాలు అవసరమవుతాయి. భాషలు ఆధారంగా రాష్ట్రాలను ఏర్పాటు చేశారు. ఆ రాష్ట్రాల పరిపాలనా సౌలభ్యం గురించి, ఆర్థిక వికాసం గురించి మనం ఆలోచించాలి. కాని నేడు భాషలను గురించే ఆలోచిస్తున్నాం. కొంకణి భాష, పోర్చుగీసు సంస్కృతి కాపాడబడాలి అంటున్నాం. మన దేశానిదంతా ఒక్కటే సంస్కృతి. పోర్చుగీసు సంస్కృతి, ఇంగ్లీషు సంస్కృతి ఫ్రెంచి సంస్కృతి కాపాడబడాలనటం ఆశ్చర్యకరమైన విషయం.

గూర్ఖాలాండ్ ఉద్యమం గురించి మీకు తెలిసి ఉండవచ్చు. పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని డార్జిలింగ్ జిల్లాలోని 3 తాలూకాలలో కేవలం రెండు లక్షల యాభై వేల మంది గూర్ఖాలు నివసిస్తున్నారు. తేయాకు తోటల్లో పనిచేస్తారు వారు. వారికి ప్రత్యేక రాష్ట్రం కావాలట. సిక్కింలో కూడ నేపాలీ భాష మాట్లాడేవారున్నారు. సిక్కింతో ఈ మూడు తాలూకాలను కలుపవచ్చు. లేదా ఈ మూడు తాలూకాలను ఒక జిల్లాగా ఏర్పరచవచ్చు. కాని గూర్ఖాలాండ్ ఉద్యమ నాయకుడైన సుభాశ్ ఘీషింగ్‌కు డబ్బు

ఎక్కడనుండి, ఎలా వస్తుందో తెలియదు కాని ప్రత్యేక దేశం కావాలని కోరుతున్నాడు. కొద్ది జనాభా కోసం, భాషలపేరిట, సంప్రదాయం పేరిట వేర్వేరు రాష్ట్రాలు ఏర్పడితే దేశ సమైక్యత దెబ్బతినే ప్రమాదముంది. సుభాశ్ ఘీషింగ్ దేశ వ్యతిరేకి కాడని చెప్పటం అసత్య ప్రచారమే. ఆ విధంగా మన దేశ నాయకులే చెప్పుతున్నారు.

జార్నెయిల్ సింగ్ భింద్రన్ వాలాను రాజకీయ నాయకుడు కాడని, ధార్మిక నాయకుడని దేశ నాయకులు అభివర్ణించారు. ఈ రాజనీతే మన దేశానికి హానికరంగా తయారయింది. ఈ ధోరణి మారినప్పుడే దేశ సమైక్యత సంభవం, దేశ సమైక్యత గురించి అందరూ మాట్లాడుతారు కాని దానిని సాధించటమెలా అని ఎవ్వరూ ఆలోచించటం లేదు, భాషా దురభిమానం, ప్రాంతీయ దురభిమానం, భిన్న సాంప్రదాయలపట్ల దురభిమానం దేశాన్ని ఛిన్నాభిన్నం చేసే విషయాలు. మరి దేశ సమైక్యతను సాధించటమెలా? ప్రాచీన కాలంలో అది ఎలా సాధ్యమైంది? ముందుగా దేశంపట్ల అచంచలమైన భక్తి భావనను ఏర్పరచేవారు. మన దేశంలోని నదులపట్ల, పర్వతాలపట్ల, తీర్థ స్థానాలపట్ల భక్తి భావనను ఏర్పరచేవారు,

గంగేచ యమునే చైవ గోదావరీ సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు

చిన్న చెంబులో నీరు తీసుకుని అన్ని నదుల జలాలు అందులోనే ఉన్నాయనే భావనతో అన్ని నదులను స్మరించేవారు.

అయోధ్యా, మధురా, మాయాకాశీ, కాంచీ, అవంతికా
పురీ ద్వారావతీచైవ సప్తైతా మోక్షదాయకా

దేశంలోని పవిత్ర నగరాలను స్మరించేవారు. ఆది శంకరాచార్యులు దక్షిణ ప్రాంతంలోని కాలడీ నుండి బయలుదేరి దేశంలోని నాలుగుమూలలా మఠాలను స్థాపించాడు - బదరీనాథ్ ఉత్తరంలో, శృంగేరీ దక్షిణంలో, జగన్నాథపూరీ తూర్పులో, ద్వారకాపురం పశ్చిమంలో ఆ మఠాలకు కేంద్రాలయ్యాయి. ఇటువంటి దేశ సమైక్యతను పెంపొందించేవారు. రాముడు ఉత్తరం నుండి దక్షిణానికి శ్రీలంక వరకు యాత్రచేసి మార్గ మధ్యంలో ఉన్న ప్రజలనందరినీ - వానరులను, అనాగరికులను కూడ వదలిపెట్టకుండా-తన మిత్రులుగా చేసుకుని ఉత్తర దక్షిణ ప్రాంతాలను కలిపాడు. కృష్ణుడు తూర్పు పడమరలను కలిపాడు. మధుర నుండి ద్వారకకు తన రాజధానిని మార్చుకున్నాడు. అరుణాచల్ ప్రాంతానికి చెందిన రుక్మిణిని వివాహమాడాడు. కాని అతని భక్తులు దేశమంతటా ఉన్నారు. భీముడు హిడింబను వివాహమాడాడు. అర్జునుడు నాగకన్య అయిన ఉలూచిని వివాహమాడాడు. మణిపూర్, నాగాలాండ్ ప్రాంతాల వారిని వివాహమాడి సమైక్యతను పెంచారన్నమాట. తూర్పు పశ్చిమాలు కలిపిన శ్రీకృష్ణుడు, ఉత్తర దక్షిణాలు కలిపిన శ్రీరాముడు అవతార పురుషులు. ప్రాచీన కాలంలో దేశ సమైక్యతా ప్రయత్నాలు జరిగే తీరు అది. సంస్కృత భాష కూడ యావద్భారతంలో మాట్లాడబడి సమైక్య భావాన్ని పెంచేది. ఉపనిషత్తులు, మహాభారతం, శ్రీమద్రామాయణం, శ్రీమద్భగవద్గీత - మరెన్నో మహాకావ్యాలు సంస్కృతంలోనే వ్రాయబడ్డాయి. దక్షిణం నుండి ఉత్తరంవరకు తన జ్ఞాన సంపదతో ఎదుటివారిని తుత్తునియలు చేసి, దేశంలో విచక్షణాజ్ఞానాన్ని పెంపొందించిన ఆది శంకరులు సంస్కృతంలోనే మాట్లాడారు. సాధారణ ప్రజలు ప్రాకృతంలో - అది హిందీయో, మరాఠీయో, గుజరాతీయో, బెంగాలీయో కావచ్చు-మాట్లాడేవారు. దేశంలో ప్రయాణసాధనాలు ఇన్ని లేకపోయినా వ్యాపార నిమిత్తం యాత్రల పేరిట ఒకచోట నుండి మరో చోటకు వెళ్తూనే

ఉండేవారు - సమైక్య భావం పోషింపబడుతూనే ఉండేది. సాధువులు, సజ్జనులు ఇచ్చే ప్రోత్సాహంతోపాటు దేశభక్తి కూడ సమైక్యతా భావాన్ని పెంపొందించింది'.

నేడు దేశంపట్ల భక్తిభావన సన్నగిల్లింది. ప్రాంతీయాభిమానం, భాషాభిమానం, మతాభిమానం పెరిగి దేశభక్తి తగ్గింది. స్వామి వివేకానంద దేవీదేవతలనందరినీ మరచినా కానీ భారతమాతను మాత్రం మరచిపోవద్ద న్నారు. వందేమాతర గీత రచయిత బంకించంద్ర "త్వంహి దుర్గా దశ ప్రహరణధారిణీ, కమలా కమలదళ విహారిణీ, వాణీ విద్యాదాయినీ" (నీవే దుర్గవు, నీవే లక్ష్మివి, నీవే సరస్వతివి) అని వ్రాశారు. భారత మాతను ఆ విధంగా ఓ దేవతగా భావించటంలోనే దేశసమైక్యత, అఖండత స్థిరపడి ఉన్నాయి.

మనం హిందువులం. ఇది మనదేశం. ఈ భూమి మన తల్లి. భారత మాత ఆమె పేరు. మనం ఆమె పుత్రులం. అందువలన ఇది హిందూదేశం కానీ నేడు మనం 'హిందూ' అనే శబ్దాన్ని మరచిపోవటానికి ప్రయత్ని స్తున్నాం. హిందూస్థాన్ అనే పదం కూడ వాడటానికి భయపడ్తున్నాం. హిందూ పదానికి 'దొంగ' అని అర్థం ఉందంటూ కొందరు చేసే ప్రచా రంలో సత్యంలేదు. 'హిందూ' పదం ప్రాముఖ్యం తగ్గించటం కోసం దానికి చెడ్డఅర్థం వచ్చేటట్లు విదేశీయులు ఆ పదాన్ని వాడారు అని చెప్తు న్నారు.

పార్శీల మతగ్రంథమైన జెండ్అవెస్తా' 16, 17 వందల సంవత్స రాలకు పూర్వపు గ్రంథం. హిందూ దేశం నుంచి బ్రాహ్మణులు. క్షత్రి యులు వచ్చి తమకు జ్ఞానాన్ని అందించినట్లు అందులో పేర్కొనబడింది. హిందూస్థాన్ అనే పేరు కూడ మనకు ఆ గ్రంథంలో కనపడ్తుంది. ఇస్లాం

మత ప్రచారకుడైన మహమ్మద్ గురించి ఓ కథ ప్రచారంలో ఉంది. మహమ్మద్ పినతండ్రి శివభక్తుడు. మీరుకూడ ఇస్లాం మతం స్వీకరించండి అని ఆయనను అడిగితే ఎందుకు స్వీకరించాలి అని ఎదురు ప్రశ్న వేశారు. మహమ్మద్‌ను రక్షించటం కోసం ఆయన చాలాసార్లు యుద్ధం చేశారు. ఆయన తాను శివభక్తుడినని, తమ శివునిలో ఎటువంటి లోపం కనపడదని చెప్పుకున్నారు. అరబ్బీ భాషలో శివునిపై కవిత్వం వ్రాశారు. ఒక గీతలో ఇలా వ్రాశారు. "హే శివభగవాన్! నన్ను హిందూస్థాన్‌లో తిరిగి జన్మింపచని! మిగిలిన దేశాలు భోగభూములు. అచటి నుండి ముక్తి లభించదు. భారతదేశమొక్కటే మోక్షభూమి!"

ఈనాడు కూడ 'హిందువు', 'హిందూస్థాన్' అనే పదాలను మనం వ్యతిరేకించలేము. పైకి వ్యతిరేకించినా ఎన్నో గౌరవనీయమైన ప్రభుత్వ సంస్థలు వాటిపేర్లతో హిందూస్తాన్ అనే పదాన్ని చేర్చుకున్నాయి. 'హిందూస్థాన్ యాంటిబయోటిక్స్', 'హిందూస్థాన్ మెషిన్‌టూల్స్', 'హిందూస్థాన్ షిప్‌యార్డ్' 'హిందూస్థాన్ ఏరోనాటిక్స్', 'హిందూస్థాన్ పెట్రోలియం కార్పొరేషన్' వంటి పేర్లు చాలా ఉన్నాయి. ప్రభుత్వం కూడ హిందూస్థాన్ అనే పదాన్ని సమర్థిస్తోంది. హిందూస్థాన్ అనే పేరుతో హిందువుగా మనల్ని మనం చెప్పుకున్నా, భారత్, భారతీయులమని చెప్పుకున్నా ఒక్కటే. హిందూస్థాన్, హిందువు అనే సంబంధం వలన సమైక్య భావం ఏర్పడుతుంది.

హిందువులకు ఒక్కటే పూజా విధానమని నిర్ణయింపబడలేదు. జైనులు, బౌద్ధులు, ఆర్య సమాజంవారు, సనాతన ధర్మానుయాయులు, లింగాయతులు, సిక్కులు - ఇలా ఎందరికో వారివారి పూజా విధానాలున్నాయి. అయితే వీరందరూ హిందూమతం వారే. గురుగోవింద సింగ్‌జీ

ఖల్సాపంథ్ స్థాపించినప్పుడు స్పష్టంగా చెప్పిన మాటలను మనం జ్ఞాపకం చేసుకోవటం మంచిది. దురదృష్టవశాత్తు కొందరు సిక్కు సోదరులు ఈ మాటలను మరచిపోయారు. "ఈ ఖల్సాపంథ్ గర్జన ప్రపంచమంతా వినిపించాలి. హిందూమతం మేల్కొనాలి. యావత్ ప్రపంచం ఖల్సా పంథ్‌ను అనుసరించాలి. తురక్ గాలిదుమారం వ్యాపించి చీకట్లు అలుము కుంటున్నాయి. ఈ గాలి దుమారాన్ని పారద్రోలాలి." వాస్తవానికి హిందూమతం ఏ మతాన్ని విరోధించదు. హిందూదేశంలో ఉండే ముస లాన్లు, క్రైస్తవులు అందరూ హిందువులే. హిందూమతంనుండి యితర మతంలోకి వెళ్ళినవారే. అందువలన వారిని హిందువులు గానే భావించ వచ్చు. ఇందులో మాకెట్టి అభ్యంతరము లేదు. మహమ్మదు ప్రవక్తపట్ల, క్రీస్తుపట్ల మనకెట్టి ద్వేషభావము లేదు. వారిని మేము సోదరులుగానే అంగీకరిస్తాం. కాని ఈ దేశాన్ని ప్రేమించాలి అనటంలో రెండోమాట లేదు. ఈ భూమిని తనదిగా భావించి సంబంధం పెంచుకోవాలి. దేశంకంటె మతం గొప్పదని మొండిగా వాదిస్తే, ఇరాన్-ఇరాక్‌ల మధ్య యుద్ధం ఎందుకు జరుగుతున్నట్లు? రెండు దేశాలు ముస్లిం దేశాలే. ఇస్లాం మతాన్ని అనుసరించేవే. వాటి మధ్య పోట్లాట ఎందుకు? అంటే మతంకంటే దేశం గొప్పది అని భావిస్తున్నాయన్నమాట. అదే నిజం. హిందూదేశంలో కూడ దేశంకంటే మతం గొప్పది అని భావించేవాడు నిజమైన పౌరుడు కాడు. భారతీయ పౌరులను చక్కటి పౌరులుగానే తయారుచేసుకుందాం. మనం ఎవరిని ఆరాధించినా దేశంపట్ల భక్తిభావన మాత్రం తప్పకుండా ఉండాలి. అదే దేశ సమైక్యతకు ఆధారభూతమైన విషయం.

దేశభక్తితో పాటు, శీలం కూడ అవసరమే. అదీ పవిత్రమైనదే. దేశ ప్రగతిశీల సంపత్తిపైనే ఆధారపడియుంది. ఇంజనీరు శీలవంతుడు కాకపోతే రోడ్డు వేయటానికి చేర్చబడిన వస్తువులు అటూ ఇటూ పోతాయి.

రహదార్లు సరిగ్గా నిర్మించబడవు. డాక్టర్లు అవినీతిపరులయితే ప్రభుత్వాంలో చికిత్స సక్రమంగా జరుగదు. మందులు మాయమైపోతాయి. తమ స్వంత ప్రాక్టీసు గురించి ఆలోచిస్తూ కూర్చుంటారు. ఉపాధ్యాయులు శీలవంతులు కాకపోతే పాఠశాలల్లో బోధించే బదులు ప్రైవేటు ట్యూషన్లు చెప్పుకుంటారు. విద్యార్థులలో క్రమశిక్షణ, శీలం లోపించినట్లయితే చదువు బదులు అక్రమ విధానాం ద్వారా పరీక్షలో కృతార్థులవటానికి ప్రయత్నిస్తారు. ఈ విధంగా దేశంలోని పౌరులందరికీ శీలం అవసరమే. ప్రజలలో శీలం ఉంటే దేశం ప్రగతి పథంలో పయనిస్తుందని సంఘ్ చెప్తుంది. సంఘ్ స్వయంసేవకులు చాలా శీలవంతులని పలువురు అంగీకరిస్తారు. అది హర్షించదగిన విషయం.

సంఘానికి అరవై సం॥లు పూర్తయిన సందర్భంలో అంటే 1985లో నేను రాష్ట్రపతిని కలుసుకోవటానికి వెళ్ళాను. సంఘ్ గురించి యితరులకు చెప్పటం, అలాగే సంఘ్ గురించి వాళ్ళ అభిప్రాయాన్ని తెలుసుకోవటం చేయాలని సంకల్పించాం. ఆయోజనలో భాగంగానే రాష్ట్రపతిని కలుసుకున్నాం. అప్పుడు ఆయనకు అడిగాం- "జ్ఞానిజీ! మీకు సంఘ్‌లో నచ్చిన విషయమేమిటి? నచ్చని విషయమేమిటి? మమ్మల్ని మేము సవరించుకుంటాం." అప్పుడు జ్ఞాని జైల్‌సింగ్ నవ్వి "మీరంతా గొప్ప దేశభక్తులు. మీకు సాటియైన దేశభక్తులు లేరు" అన్నారు. అందులకు చాలా సంతోషం అన్నాను నేను. ఇంకా ఇట్లా అన్నారు 'మీరందరూ క్రమశిక్షణను పాటిస్తారు. అది కూడ మాకు ఆనందకరమైన విషయమే" అని నేను అన్నాను. అప్పుడు మూడవ విషయం మరొకట్నుంది. మీరంతా సచ్ఛీలురు. **Moral character** మీకు ఎక్కువ అన్నారు. "చాలు చాలు మీరు మమ్మల్ని చాలా ఎక్కువగా పొగుడుతున్నారు. ఇంత ఎక్కువగా పొగిడితే మేము భ్రష్టులమైపోతాం. మీరు సంఘ్ గురించి ఈ మూడు

విషయాలను చేప్తేచాలు. సంఘ్‌లోనివారు శీలవంతులు, క్రమశిక్షణ కలిగిన వారు, దేశభక్తులు అని చెప్పండి చాలు.'' అని నేను చెప్పాను. ఇదే విషయాన్ని అందరూ చెప్తారు. దేశనాయకులు కూడా అంగీకరిస్తారు.

దేశరక్షణ సమితి తరఫున కొందరు ప్రధానమంత్రిని ఈ మధ్య కలుసుకున్నారు. వారిలో కొందరు సంఘ్‌లో పనిచేసేవారున్నారు. పంజాబ్‌లో పనిచేసే వారున్నారు. వారంతా పాకిస్థాన్‌వైపు ఉన్న సరిహద్దులో రక్షణ వ్యవస్థను పటిష్టవంతం చేయాలని ప్రధానిని కోరారు. "దేశంలో శీలరాహిత్యం ఉంటే సరిహద్దు ప్రాంతంలో సైన్యాన్ని పెంచినా, సరిహద్దు రక్షణ దళాన్ని పెంచినా, పోలీసుల్ని పెంచినా ఒకటే. మనమను ష్యులు నీతిమంతులు కానట్లయితే ఏమీ ప్రయోజనం ఉండదు," అని ప్రధాని సమాధానం చెప్పారు. కాని ఇప్పుడు ఆ శీలాన్ని ఎలా సంపాదించుకోగలం. ఈ దేశం నాది, దీని కొరకు నేను ఏదైనా చేస్తాను అనే భావనతోనే సచ్ఛీ లం పెరుగుతుంది. సచ్ఛీలం గురించి అందరూ ఆలోచిస్తున్నారన్న విష యమే చాలా సంతోషించ దగ్గది. దేశసమైక్యత కోరుకుంటున్నట్లయితే, దేశంలో హిందుత్వ భావన పెరగాలి. శీలప్రాముఖ్యం గురించి ప్రజలకు తెలియజెప్పాలి. కానీ పాఠశాలల్లో కళాశాలల్లో రామాయణ, భారత కథ లను చెప్పలేక పోతున్నాము. క్రైస్తవ పాఠశాలల్లో బైబిలు గురించి చెప్తు న్నారు. ముస్లిమ్ పాఠశాలల్లో కురాన్ నేర్పుతున్నారు. కానీ దేశం అంతా హిందువులు కల హిందూదేశంలో భగవద్గీత గురించిగానీ, రామాయణ మహాభారతాల గురించిగానీ చెప్పటానికి వీలులేదు. ధర్మంగురించి అసలు చెప్పలేము. శ్రీరామచంద్రుడు మానవాళికి, విశ్వానికి ఆదర్శ పురుషుడు. కానీ రామాయణం గురించి మన పాఠశాలల్లో చెప్పకూడదు.

అటువంటి పరిస్థితులలో శీలం ఎలా నిర్మాణ మవుతుంది? నేడు మన ముందు మంచి ఆదర్శమే లేదు. పూర్వం ఋషులు సాధువులు,

సజ్జనులు, ఉండేవారు. శీలవంతులయిన హరిశ్చంద్రుడు, రాముడు ఛత్ర పతి శివాజీ వంటి రాజులు ఉండేవారు. కానీనేడు మనముందు నటులు నాయకులు ఉన్నారు. వీరు ప్రజలముందు మంచి ఆదర్శాన్ని ఉంచలేరు. ప్రయాగనుండి అమితాబ్ బచ్చన్ లోక్ సభకు ఎన్నికయ్యారు. ఆయన దేశంకోసం ప్రత్యేకించి చేసిన సేవ ఏమీలేదు. నటుడిగా పేరు సంపా దించుకున్నందున ఎన్నికలలో గెలిచాడాయన. ఇప్పుడు గ్రామాలకు వెళ్లి 'దేశంలో ఇటువంటి నిరుపేదలున్నారా? నాకు తెలియదే?' అని ఆశ్చర్య పోతున్నారు. అటువంటి వారు - దేశ పరిస్థితులు తెలియని వారు - ప్రజ లకు ఏమి మార్గ దర్శకత్వం చేయగల్గుతారు.

మరికొంతమంది రాజకీయ నాయకులు ఈనాడు ఒక పార్టీలో ఉంటే మరునాడు మరొక పార్టీలో ఉంటున్నారు. శ్రీ హేమవతీ నందన్ బహుగుణ నాకు మిత్రులే. ప్రయాగ విశ్వ విద్యాలయంలో చదివారు. నాకంటే రెండు మూడు సంవత్సరాలు జూనియర్, స్నేహితులవటంవలన అప్పు డప్పుడు కలుస్తూనే ఉంటాము. కలిసినప్పుడు ఆయనను ఎగతాళి చేస్తూ ఇప్పుడు ఏ పార్టీలో ఉన్నారు. అని అడుగుతూ ఉంటాను. ఒక్కొక్కసారి మన రాజకీయ నాయకులు ఏ పార్టీలో ఉండాలో కూడ నిర్ణయించుకోలేక పోతున్నారు. వారు దేశ ప్రజలకు మార్గదర్శకత్వం ఏమి చేయగలరు? శీల నిర్మాణం ఎలా జరుగుతుంది.

నేడు ప్రపంచంలో 44 ముస్లిం దేశాలు ఉన్నాయి. పాకిస్తాన్, అఫ్ఘనిస్థాన్, ఇరాన్, ఇరాక్ మొదలైన దేశాలవి. ఆ దేశాలలో అరబ్బీ భాషను నేర్చుకోవచ్చు. ఇతరులకు నేర్పవచ్చు. ఖురాన్ ప్రచారం చేసు కోవచ్చు. ఈ దేశాలలో చదువుకున్న వారి శాతం తక్కువే. కానీ ఆ దేశాలకు వెళ్ళి పనులు చేసుకోవలసి వస్తోంది. ఆదేశాలనుండి కోట్ల కొలది

పెట్రోడాలర్లు భారతదేశానికి వస్తున్నాయి. మనదేశం పేద దేశం కాబట్టి ఇక్కడి పేదవారికి డబ్బు ఆశచూపి, మతం మార్చుకోమని ప్రోత్సహించి, ముసల్మానులుగా మారుస్తున్నారు. మన ప్రభుత్వం అటువంటివారిని దేశం లోకి అడుగుపెట్టనిస్తోంది. అది చాలా సిగ్గుపడాల్సిన విషయం.

విదేశాలనుంచి ఎంత డబ్బు వస్తుందో మన ప్రభుత్వానికి తెలియదు. విదేశాలనుంచి భారత దేశానికి డబ్బు రావటం కొన్ని సంస్థలు దానిని స్వీక రించటం ప్రభుత్వానికి తెలియకపోవటం అంతా దేశాభ్యుదయానికి అవ రోధమే. విదేశీ ధన సహాయం ప్రభుత్వం ద్వారానే రావాలి. ఏ విధంగా ఖర్చు పెట్టవలసింది ప్రభుత్వమే నిర్ణయించాలి. కేరళ తమిళనాడుల్లో మసీదుల నిర్మాణానికి ఒక లక్ష రూపాయలు ఖర్చు అయితే ఈనాడు వాటి మరమ్మత్తుల పేరుతో 70 లక్షల రూపాయలు విదేశాలనుండి వస్తున్నాయి. వాస్తవానికి ఈ ధనం మసీదుల మరమ్మత్తు కోసం కాదు, హిందువులను ముస్లిమ్‌లుగా మార్చటం కోసం, ముస్లిమ్‌ల సంఖ్య పెంచటం కోసం వస్తోంది. ఇన్ని దేశాల నుండి మతం మార్పిడి కోసం మన దేశంలోకి ధనం వస్తోందంటే ఎంత ప్రమాదకరమో ఆలోచించండి.

ప్రపంచంలో 66 క్రైస్తవ దేశాలున్నాయి. ఈ దేశాల నుండి వేలాది మంది ఫాదరీలు, కోట్ల రూపాయలతో మన దేశానికి వచ్చి, వెనుకబడిన ప్రాంతాలలో, వనవాసీ ప్రాంతాలలో తిరుగుతూ అచ్చటి ప్రజలను క్రైస్త వులుగా మారుస్తున్నారు. విశాఖపట్టణం, శ్రీకాకుళం, ఒరిస్సా, మధ్య ప్రదేశ్ మొదలైన ప్రాంతాలలో వన్య ప్రదేశాలలో క్రైస్తవులు తయారవు తున్నారు. పోప్ అంటే మనకేమీ ద్వేషం లేదు. ఎవరి పూజా విధానం వారిది. కాని మతం మార్చుకున్న వారు వేర్పాటు వాదాన్ని ప్రోత్సహిస్తూ విచ్ఛిన్నకర శక్తులకు అండగా నిలుస్తున్నారు. క్రైస్తవులుగా మారినవారు

నాగాలాండ్‌లో, మిజోరామ్‌లో, మేఘాలయలో, గోవాలో విభజనను కోరుతున్నారు. వీరి వెనుక ఫాదరీలు ఉన్నారు. జార్ఖండ్‌లోకూడ ఇదే విషయం మనకు కనపడుతున్నది. ఇలా విదేశాల నుండి అందే ధన సహాయంతో మన ప్రజలు క్రైస్తవులుగా మారిపోయి ఆ తదుపరి దేశంలో వేర్పాటు వాదాన్ని ప్రచారం చేస్తుంటే మనం చూస్తూ కూర్చోవలసిందేనా?

ప్రపంచంలో హిందువులకంటూ ఉన్నది ఒక్క భారత దేశమే. మన దేశంపై తమ ప్రభావాన్ని చూపాలని ప్రయత్నించే ముస్లిమ్ దేశాలు, క్రైస్తవ దేశాలు, కమ్యూనిస్టు దేశాలు ఉన్నంత వరకు మనం మన ధర్మాన్ని, ఆ ధర్మాలను సక్రమంగా ఆచరించగలమా? సగర్వంగా హిందువులుగా మనగలమా? అహ్మదాబాద్‌లో జగన్నాధుని యాత్రకు, కృష్ణాష్టమి నాడు కృష్ణుని ఊరేగింపుకు, ఢిల్లీలో రామలీల ఉత్సవాలకు అనుమతి లభించకపోవచ్చని వింటున్నాం. హిందువుల ఊరేగింపులకు మహ్మదీయులు అభ్యంతర పెడితే, లేక గొడవలు చేస్తారనిపిస్తే ప్రభుత్వం కూడ అనుమతి యివ్వకపోవచ్చు. ఈ విషయం మీద పత్రికా విలేఖరులు నన్ను అడిగారు. కృష్ణుని ఊరేగింపు, రాముని ఊరేగింపు భారతదేశంలో జరగక కువైట్‌లోనో, సౌదీ అరేబియాలోనో జరుగుతాయా అని అడగవలసి వచ్చింది. అసలు ఇది అడగవలసిన ప్రశ్నే కాదు.

రామజన్మభూమి గురించి వివాదం ప్రస్తుతం చర్చనీయాంశంగా మారింది. 400-450 సంవత్సరాలకు పూర్వం బాబరు అనే విదేశీ దురాక్రమణ దారుడు, అయోధ్యమీద దాడిచేసి, అచ్చటి రామమందిరాన్ని ధ్వంసంచేసి, మసీదును నిర్మించాడు. మసీదు స్థంభాలపై స్వస్తిక్, శంఖం, గద మొదలగు చిత్రాలు ఇప్పటికీ ఉన్నాయి. ఆ మసీదులో ముస్లిములకు న అలవాటుకూడ లేదు. అసలు అయోధ్యలో ఉండే ముస్లిమ్‌లి

సంఖ్య కూడ తక్కువే. ఇప్పుడు షాబుద్దీన్, సులేమాన్ సేట్ లు అయోధ్యలో మసీదు ఎప్పటినుంచో ఉన్నట్లు మాట్లాడుతున్నారు. రామ జన్మభూమిలోని రామ మందిరాన్ని హిందువులకు యిచ్చేది లేదు అంటున్నారు. హిందువులేమైనా బీహార్ షరీఫ్, అజ్మీర్ షరీఫ్‌వంటి ముస్లిమ్ పవిత్ర స్థానాలను కోరుతున్నారా? రాముడు, కృష్ణుడు పుట్టిన ప్రదేశాలకి, కాశీ విశ్వనాథుని స్థానానికి హిందూ సమాజంలో అత్యంత పవిత్రమైన స్థానముంది. ఆ ప్రదేశాలలోని హిందూ మందిరాలను విదేశీపాలకులైన బాబరు, ఔరంగజేబు పడగొట్టి, మసీదులు నిర్మించారు. మన ధర్మాన్ని అగౌరవపరిస్తే మనవారంతా ఇస్లాం మతంలో చేరతారని వారి నమ్మకం. అందువలన అలాచేశారు. దేశంలో ఉన్న మసీదుల నన్నింటినీ పడగొట్టి హిందువు కప్పజెప్పమని మన ఉద్దేశ్యం కాదు. స్పెయిన్‌లో వలెకాదు, మన పవిత్ర స్థానాల్ని తిరిగి మనం సంపాయించుకోవాలి. ఈ దేశంలోని ముస్లిమ్ లందరూ విదేశాల నుండి వచ్చినవారు కారు. తుర్కిస్థాన్, అరబ్బీస్థాన్ నుండి వచ్చినవారు కారు. ఇచ్చటి హిందువులే ముస్లిమ్‌లుగా మారారు. రాముడు వాళ్లకు కూడ పూర్వీకుడే. పూజనీయుడే. మన పవిత్రస్థానాలి తిరిగి మనకు ఇవ్వమంటున్నాం. రాముడు అయోధ్యలోనే పుట్టాడని ఏమి దాఖలా అని షాబుద్దీన్ అంటాడు. అది చాలా అసంగతము, అసంబద్ధము అయినప్రశ్న. మహ్మద్ పుట్టినట్లు మునిసిపాలిటీనుండి షాబుద్దీన సర్టిఫికేట్ తేగలడా? మహ్మద్ పుట్టుకకు సంబంధించి అతని అనుచరు నమ్మకానికే ఎక్కువ ప్రాముఖ్య మిస్తాం. శ్రీరామచంద్రుని విషయంలోను అంతే. హిందువులంతా శ్రీరాముడు అయోధ్యలో పుట్టాడని నమ్ముతారు అంతే రాముని పుట్టుక గురించి హిందువులు ప్రామాణికంగా స్వీకరించే గ్రంథాలన్నీ చెప్తున్నాయి. అందువలన శ్రీరామచంద్రుడు అయోధ్యలో జన్మించాడు. హిందువులందరికీ రాముడు ఆరాధ్యదైవం. ఆయనపే గ్రామాలకు పెట్టుకున్నారు. రామగుండం, రామనాధపురం వగైరాలు అ

వంటివే. రామాయణంలోని ఒక సంఘటన తమ గ్రామంలో జరిగిందని చెప్పుకుంటే హిందువులకు సంతోషం. ఉత్తరం, దక్షిణం అని తేడా లేకుండా రాముని పేరు హిందువులందరూ తమ పిల్లలకు పెట్టుకుంటారు. రాముడు హిందువుల జీవనమంతా నిండి ఉన్నాడు. అటువంటి అవతార పురుషుని స్థానం గురించి వివాదం లేకెత్తించటమా?

గుజరాత్‌లోని సోమనాధ మందిరం విధర్మీయుల దాడికి పలుసార్లు గురయింది, మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సోమనాధ దేవాలయ పునరుద్ధరణకోసం సర్దార్ వల్లభాయి పటేల్ ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. సోమనాధ మందిర గోపురంపై కలశం మెరుస్తూ ఉండటమే మన స్వాతంత్ర్యానికి చిహ్నం అన్నారు. ఆ సమావేశంలో పాల్గొన్న ముస్లిమ్‌లు కూడ ఆయనను సమర్థించారు. సోమనాధ మందిరంవద్ద మసీదు అవసరం లేదన్నారు. కాని రామజన్మభూమి విషయంలో అనవసరపు వివాదాన్ని లేవనెత్తుతున్నారు. హిందువుల పవిత్ర స్థానం హిందువులకు అప్పగించినప్పుడే ముస్లిమ్‌లపట్ల హిందువులకు సద్భావన ఏర్పడుతుంది. ఈ విషయంలో ఘర్షణకు ముస్లిమ్‌లు దిగతలుస్తే వారు ఈ దేశంలో హిందువులతో కలసిమెలసి జీవించాలన్న విషయం మరచిపోకూడదు. బాబరు, ఔరంగజేబులే ముఖ్యమనుకుంటే వారి వెనుకే వీరు వెళ్ళవలసి వస్తుంది. వారికి హిందూ దేశంలో స్థానం లేదు.

ఒకసారి ఒక ముస్లిమ్ ప్రొఫెసరు నన్ను కలుసుకుని నాతో యిలా అన్నారు "ప్రొఫెసరుగారూ (నేనుకూడ ప్రయాగ విశ్వ విద్యాలయంలో కొంతకాలం ప్రొఫెసరుగా పని చేసాను) పాత విషయాల నన్నింటినీ మనం మరచిపోవాలి సార్'' అని నేను ఆయనతో చెప్పిన విషయాలనే తిరిగి చెప్పాలి. "కొన్ని లక్షలమంది హిందువులు ప్రతి సంవత్సరం అయోధ్య

మధుర, కాశీ యాత్రలకై వెళ్తుంటారు. అక్కడ మసీదులని చూసిన తరువాత, చరిత్రను జ్ఞాపకం చేసుకున్న తరువాత, వారి మనస్సులలో ముస్లిమ్‌లపట్ల సద్భావన ఎలా ఏర్పడుతుంది, 4, 5 స్థానాలలోని మసీదులను తొలగించండి. అలా మసీదులను తొలగించటంవలన హిందువుల హృదయాలలో ఎటువంటి సద్భావన ఉత్పన్నమౌతుందో చూడండి. కావాలంటే క్రొత్త స్థలాన్ని తీసుకోండి. చందాలు మేముకూడ యిస్తాం అని అన్నాను.

నేడు హిందూ సమాజం జాగృతమైంది. ఇది చాలా సంతోషించదగ్గ విషయం. హిందువులలో స్వాభిమానం తలెత్తింది. 60 కోట్ల మంది హిందువులలో సక్రియాత్మక నవజాగరణ దేశానికి లాభసాటి, అప్పుడు దేశం శక్తివంతంగా తయారవుతుంది. 44 ముస్లిమ్ దేశాలలో 10 కోట్ల జనాభా కలిగిన ఇండోనేషియా, 9 కోట్ల జనాభా కలిగిన బంగ్లాదేశ్‌లు పెద్దవి. క్రైస్తవ దేశాల్లో 20 నుండి 22 కోట్లవరకు జనాభా కలిగిన అమెరికా రష్యాలు పెద్దవి. 65 కోట్ల హిందూ జనాభాలో 62 కోట్ల హిందువులు హిందూ దేశంలో నివసిస్తున్నారు. ఈ 62 కోట్ల మంది జాగృతమైతే, సక్రియాత్మకంగా ముందుకు వచ్చి నిలబడితే ఎంత పెద్ద మార్పు వస్తుంది !

ప్రస్తుతం సుమారు 50 లక్షల మంది స్వయంసేవకులున్నారు. వీరు ఒకటి రెండు కోట్ల మందిని జాగృతం చేయగల్గుతున్నారు. అంటే చాలా మార్పు వస్తోందని అర్థం. అయితే విదేశాలనుండి అంటే అమెరికా వంటి దేశాల నుండి క్రైస్తవ మిషనరీలకు, అరబ్ దేశాలనుండి ముస్లిమ్‌లకు ధన సహాయం లభిస్తుంటే వారిని మనం ఎలా ఎదుర్కొనాలి అనే సమస్య మన వారిని కలవరపెడ్తోంది. హిందువులలో చైతన్యం వచ్చి

నప్పుడు సమస్య పరిష్కారమవుతుంది. హిందువులు కష్టించి పనిచేయ వలసిన అవసరం ఎంతైనా ఉంది. అలా పనిచేసిననాడు మనం దేనికీ బాధపడవలసిన అవసరంలేదు. హిందువులలో ఎక్కువ శాతం పేదవారు ఉండవచ్చు. కానీ హిందూ దేవాలయాలకు చాల డబ్బు వస్తుంది. తిరుపతి (వేంకటేశ్వరునికి) బాలాజీ దేవాలయానికి, బదరీనాథ్, కేదారనాథ్, శబరి మలైకి చాలా మంది భక్తులు వెళ్తుంటారు. కానుకలు సమర్పిస్తుంటారు. ఆ విధంగా ఎంతో ధనం సమకూరుతోంది. దానిని సమాజ శ్రేయస్సుకు ఉపయోగించినట్లయితే ఎంత గొప్ప మార్పు సంభవించవచ్చు. వేంక టేశ్వరునికి వజ్రాల కిరీటం చేయిస్తున్నారు. సృష్టికి అధిపతి అయిన భగ వంతుడు ఈ విశ్వంలో ఉన్న విలువైన వజ్రాలన్నింటికీ అధిపతి. అటు వంటప్పుడు ఈ వజ్రాల కిరీటం ఎందుకు? అసలు వజ్రాల కిరీటం కన్నా పూల కిరీటం చాలా గొప్పగా ఉంటుంది. ఆ వేంకటేశ్వరుని పూజించే హిందూ సమాజం శాశ్వతంగా ఉండాలంటే ఆ ధనాన్ని హిందూ సమాజ అభ్యున్నతికి వెచ్చించాలి. ఆ ధనాన్ని వనవాసుల కళ్యాణం కోసం ఖర్చు చేయాలి. వెనుకబడిన ప్రాంతాలలో వైద్యశాలలు, పాఠశాలలు ఆ ధనంతో నిర్మిస్తే యిక లోటు ఎక్కడ ఉంటుంది? వివాహాలలో అనవసరమైన ఖర్చుచేసే అలవాటును మానుకోవాలి. కడుపునిండిన వారికి వృథాగా భోజనం పెట్టటం అనవసరం. వెనుకబడిన వర్గంగా పిలువబడేవారు కూడ మన సోదరులే! భారత మాత పుత్రులే. వారికి మనకూ విడదీయరాని అనుబంధం ఉంది. వారు కూడ మనలాగే రాముని, కృష్ణుని పూజిస్తారు. మనలాగే వేదాలను, ఉపనిషత్తులను, భగవద్గీతను గౌరవిస్తారు. అనుస రిస్తారు. మనశక్తి, ధనం అంతా వారి సేవకులకు ఉపయోగపడాలి. 60 కోట్ల హిందువులు కలసి గొప్ప శక్తిగా ఏర్పడితే భారతదేశం అభివృద్ధి తప్పకుండా జరుగుతుంది.అంతేకాదు.ప్రపంచానికే మానవత్వపు విలువలను చాటి చెప్పి 'వసుధైక కుటుంబం'ఒక వాస్తవం అని ఋజువుచేయవచ్చు.

మొదటి ప్రపంచ యుద్ధం, రెండవ ప్రపంచ యుద్ధం క్రైస్తవ దేశాల మధ్యనే జరిగాయి. జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లాండ్, రష్యా, అమెరికా ఇటలీ మొదలైన వన్నీ క్రైస్తవ దేశాలే. ఆరు సంవత్సరాలుగా ఇరాన్ - ఇరాక్ ల మధ్య యుద్ధం జరుగుతోంది. అవి రెండూ ముస్లిం దేశాలే. కాని ఒకదాన్ని మరొకటి సర్వనాశనం చేయాలని చూస్తున్నాయి. చాలా సంకుచితమైన భావాన్ని ప్రదర్శిస్తున్నాయి. అందువలన క్రైస్తవ, ముస్లిమ్ దేశాలు సోదరభావాన్ని నేర్పలేవు. జాగృతమైన నవభారతం మాత్రమే భాతృత్వభావనను ఈ ప్రపంచానికి నేర్పగలదు. ఉదార చరితానాంతు వసుదైవ కుటుంబకమ్ అని చెప్పినది భారతదేశం ఒక్కటే. చాలా సంకుచిత మనస్కులు మాత్రమే ఇదినాది, ఇదినీది అని అంటారు. విశాల హృదయం కలవారు ప్రపంచమంతా ఒక కుటుంబం అని ఆలోచిస్తారు. "సర్వేఽపి సుఖినస్సన్తు సర్వేసన్తు నిరామయాః" అని చెప్పగల వారెవరు? అంతా సుఖంగా ఉండాలని, అందరూ రోగవిముక్తులు కావాలని కోరేదెవరు? సర్వే భద్రాణిపశ్యంతు" ఇది మనపూర్వుల సిద్ధాంతం. ప్రపంచానికి మానవత్వాన్ని సోదరభావాన్ని క్షేత్రం హిందువులు మాత్రమే నేర్పగలరు. అయితే భిక్షాపాత్ర పట్టుకొన్న హిందూదేశం రాదు. శక్తివంతమై సర్వ సమృద్ధవంతమై సుసంపన్నమైన హిందూదేశమే ఆ పని చేయగలదు.

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ భారతదేశాన్ని ఆ విధంగా తీర్చిదిద్దాలని కలలుకంటున్నది. "పరం వైభవం నేతుమే తత్స్వరాష్ట్రం" అని స్వయంసేవకులు ప్రతినిత్యమూ స్మరిస్తారు. ఈ దేశాన్ని పరమ వైభవ స్థితికి తీసుకువెళ్ళాలి. ఆ వైభవాన్ని తిలకిస్తూ ముందుకు వెళ్ళాలి అని స్వయం సేవకులు ఆశిస్తారు.

స్వయం సేవకులు ప్రస్తుతం చేస్తున్న కృషికంటె ఇంకా ఎక్కువ కృషి చేయాలి. ప్రతి హిందువు దగ్గరకు వెళ్ళి మనం భారతమాత పుత్రులం అని జ్ఞాపకం చేయాలి. ప్రతి మాతృమూర్తి వద్దకు, సోదరి వద్దకు, సంఘ సానుభూతిపరుని వద్దకు వెళ్ళి ఈ దేశం కేవలం రాజీవ్ గాంధీదో, వాజ్‌పాయిదో, యన్.టి. రామారావుదో కాదనీ మనందరిదీ అని చెప్పి వారిని జాగృతం చేద్దాం. ఈ దేశం లేకపోతే మనకు ఇంకా ఏదీ లేనట్లే. అందుకని ఈ దేశాన్ని రక్షించుకోవటం కోసం మన సర్వస్వం ఒడ్డి కృషి చేద్దాం. ఒకసారి ఓటువేస్తే బాధ్యత తీరదు. ఈ సమాజం కోసం, ఈ దేశంకోసం, బుద్ధిని, ధనాన్ని, సర్వస్వాన్ని అర్పిస్తానని ప్రమాణం చేద్దాం. "నా సోదరుడు, నా కొడుకు, నాభర్త ఈ సమాజం కోసమే. వారి సేవలు జీవితం ఈ దేశం కోసమే" అనే భావనను పెంచుదాం. అటువంటి భావనలు ప్రతి వ్యక్తిలోనూ పెరిగితే ఈ దేశం యొక్క రూపమే మారిపోతుంది. అలా మార్చటానికే మా కృషి దీనికి మీ అందరి సహకారం కావాలి. సదవగాహన, సహకారంతో అడుగు అడుగు కలిపి నడుద్దాం. ఈ హిందూ సమాజాన్ని తిరిగి ప్రపంచానికి గురువుగా తల్లిగా తీర్చి దిద్దుదాం. అటువంటి సంకల్పంతో ఇక్కడనుండి వెళ్లుదాం.

# ఇరవై నాలుగు గంటలూ స్వయంసేవక్

(స్వయం సేవకుల నుద్దేశించి చేసిన ప్రసంగం)

సాధారణ స్వయంసేవక్ ఈ శిబిరాలలో పాల్గొనటం చాలా కష్ట మయమైన విషయంగా భావించవచ్చు. చాలా కాలం నుండి శాఖకు వస్తున్న వారు శిక్షా వర్గలలో పాల్గొని యుండవచ్చు. శిక్షావర్గ 15, 25, 30 రోజులు జరుగుతూ ఉంటుంది. అప్పుడు ఇటువంటి జీవనం గడపటం అలవాటు అవుతుంది. మరికొందరు ప్రాథమిక శిక్షావర్గలో పాల్గొని యుండ వచ్చు. అది 8 రోజులు ఉంటుంది. అందువలన కొంత అలవాటు అవుతుంది. మిగిలిన స్వయంసేవకులకు ఇటువంటి అలవాటు పూర్వ ముండదు. ఈ శిబిరంలోనే కష్టమయ జీవనం గడపటం నేర్చుకుంటారు. అందువలన ఇటువంటి శిబిరాలను నిర్వహించి స్వయంసేవకులు వానిలో పాల్గొనాలి. అప్పుడు కష్టసహిష్ణుత, అను శాసనబద్ధ జీవనం గడపటం అలవాటు అవుతుంది. శాఖా కార్యక్రమంలో ఒక గంట మాత్రమే పాల్గొన టానికి అవకాశం లభిస్తుంది.

సుఖమయ జీవనం మాత్రమే కాక, కష్టమయ జీవనం కూడా అలవాటు ఉన్న ప్రజల దేశం ప్రగతిని అవలీలగా సాధిస్తుంది. అటువంటి అలవాటుకోసమే ప్రగతిని సాధించిన అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ వంటి దేశాలలో పర్వతారోహణం, సైక్లింగ్ వంటి కార్యక్రమాల ద్వారా యువతీ యువకులకు కష్టమయ జీవనాన్ని అలవాటు చేస్తారు. మన దేశంలో కూడ కర్షకులు, కార్మికుల వంటి సామాన్యులు కష్టమయ జీవనానికి అలవాటు

పడినవారే, అధ్యాపకులు, వ్యాపారులు, విద్యార్థులు వంటి వారికి అటువంటి అవకాశం తక్కువ. పూర్వకాలంలో తీర్థయాత్రలు చేసేవారు. మన దేశంలో పవిత్ర స్థానాలు సాధారణంగా కష్టపడి చేరవలసిన ఎత్తైన ప్రదేశాలలో ఉన్నాయి. తిరుపతి, బదరీనాథ్, కేధారనాథ్, మాతా వైష్ణవీ దేవి, శబరిమలై మొదలైనవి అందుకు ఉదాహరణలు. వీటన్నిటిని చేర టానికి కాలినడక తప్పదు. అతి సామాన్య భోజనం, నేలమీద పడక కూడ ఈ యాత్రలలో అలవాటవుతుంది. అలాగే రాజులు కష్టమయ జీవనం అలవాటుచేసుకొనటానికి వేట వంటి కార్యక్రమాలుండేవి. అడవులకు వెళ్ళి రాత్రంతా చెట్లకొమ్మలపై కూర్చొని, తిండీ తిప్పలు సరిగ్గా లేకపోయినా ఓర్మితో కష్టమయ జీవనాన్ని అలవాటు చేసుకోవటం జరిగేది. ఈ విధంగా మన దేశంలో ప్రజలకు కష్టమయ జీవితం గడపటం అలవాటు అయ్యేది.

ఈ శిబిరం కూడా అటువంటి జీవనాన్ని అలవాటు చేసుకోటానికి తోడ్పడుతుంది. ఉదయం రెండున్నర గంటలు సాయంత్రం మరో గంటన్నర శారీరక (వ్యాయామం) చెయ్యాలి. భోజనం మన అభిరుచిని బట్టి ఉండదు. శిబిరాన్ని వదలి బయటికి వెళ్ళటానికి వీలులేదు. అయినా యిటువంటి నియమాలను అనుసరించటంలోనే ఆనందాన్ని అనుభవించే వారే మంచి స్వయంసేవకులుగా రూపొందగలరు అని మనం భావిస్తాం.

స్వయంసేవకులందరిలో కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. ఆ లక్షణాలేమిటో తెలుసుకుని, వాటిని మరచిపోకుండా చూసుకోవాలి.

హిందుత్వ భావనపై విశేషాభిమానాన్ని మనం చూపుతాం. మన హిందువులైనందుకు గర్వపడుతాం ఈ దేశం మనదనీ, మనందరిదీ ఒక సంస్కృతి అనీ, అది మహోన్నతమైనదనీ భావిస్తాం. అయితే యి హిందుత్వ భావనపై అభిమానం కలవారు యితరులు కూడా కొ

రున్నారు. మనకంటె వారికి అభిమానం ఎక్కువ. మనకంటె ఖచ్చితంగా, గట్టిగా మొండిగా హిందువులమని చెప్పుకునేవారున్నారు. అయితే కావలసింది సక్రియాత్మక హిందూ భావన సంఘ స్వయంసేవకులు సక్రియులైన హిందువులు. అంటే ఆచరణలో హిందువులు. కొంత సమయాన్ని వెచ్చించి, హిందూ సమాజం గురించి ఆలోచించి హిందూ సమాజ శ్రేయస్సు కోసం పనిచేసే హిందువులు స్వయంసేవకులు, యితరులు అలా సమయాన్ని వెచ్చించలేరు. హిందుత్వ భావనపైఅభిమానం ఉంటుంది కాని ఏమీ చెయ్యరు. సక్రియుడైన హిందువుగా స్వయంసేవక్ యొక్క గుర్తింపు మొదట్లో సమాజం కోసం ఒక గంట సమయమివ్వండి అన్నారు. అలా గంట సమయమివ్వటం ప్రారంభమైంది. ఆ తరువాత గటనాయక్ అయ్యాం. గటలో స్వయంసేవకులను కలుసుకుంటూ మరి కొంత సమయాన్ని కేటాయించటంతో గణశిక్షక్, ముఖ్యశిక్షక్ అలా బాధ్యతలు పెరిగాయి. పనులు పెరిగాయి. స్వయంసేవకులు యిళ్ళకు వెళ్ళటం, యితరులను కలవటం యిలా పనులలో పెంపుదల. ఆ తరువాత మండల కార్యవాహ, ఆ తరువాత యితర శాఖల గురించి ఆలోచించటం యిలా సమయాన్ని సాధనసంపత్తిని సమాజ దేశహిత కార్యక్రమాలలో కార్యానికి ఉపయోగించటం - ఇదే స్వయంసేవక్ యొక్క మొదటి ప్రత్యేకత. స్వాభిమానంగల హిందువు అవటమే కాదు దేశం కోసం పని చేయటం మన లక్షణం. దేశంలో కొందరు హిందువులు మాటలలో స్వాభిమానాన్ని ప్రదర్శిస్తారు. చేతలు మాత్రం శూన్యం. స్వయంసేవకులు అలా కాకూడదు. ఎవరైనా స్వయంసేవకులను నిందించినా, వారిపై దుష్ప్రచారం చేసినా ఫరవాలేదు కాని, స్వయం సేవకులు నిష్క్రియులు, ఏ పనీ చేయరు అంటే మనం బాధ పడాలి. సక్రియాత్మకత మన ప్రత్యేకత. అదే మన మొదటి కొలబద్ద కూడ.

దేశ సమస్యల గురించి మనం నిరంతరం ఆలోచిస్తూ ఉంటాం. ముస్లింలు విదేశీ ధనసహాయంతో మన దేశస్థుల మతం మార్చటానికి చేసే

ప్రయత్నాలు మనకు ఆందోళన కలిగిస్తున్నాయి. అలాగే వివిధ రకాల క్రైస్తవ మిషనరీలు విదేశీ ధనసహాయంతో, వనవాసుల మతం మార్చి వేస్తున్నారు. కమ్యూనిస్టులు కూడ ఇక్కడ ప్రవేశిస్తున్నారు. ఇప్పుడు మన దేశంలో శీల రాహిత్యం పెరిగింది. సమాజంలో కులతత్త్వం, ప్రాంతీయ దురభిమానం, భాషా దురభిమానం పెరిగింది, ఈ విషయాలన్నింటి మధ్యా మనలో నిరాశ మాత్రం పెరగలేదు. మనం నిరాశావాదులం కాదు. ఈ సమస్యలకు పరిష్కారం కనుగొనాలనే ఉద్దేశ్యంతో మనం వాటి గురించి చర్చిస్తాం. అందువలన స్వయం సేవకుల మాటల్లో ఆశాభావం వ్యక్తంకావాలి విశ్వాసం ప్రతిబింబించాలి. స్వయం సేవకులలో ఇది మరొక ప్రత్యేకత. సంఘ కార్యం దైవ కార్యమనే భావనతో మనం పనిచేస్తాం. ప్రార్థనలో 'త్వదీయాయ కార్యాయబద్ధా కటీయం' అని చెప్తాం. అంటే సంఘ కార్యం ఈశ్వరుని కార్యం. మన స్వార్థంకోసం మనం పనిచేయటంలేదు. కాబట్టి దైవ కార్యంలో అపజయమంటూ ఉండదు. మన సాధన సంపత్తిలో బలహీనతలున్నా లోటుపాట్లు ఉన్నా, దైవకార్యంలో విజయమే లభిస్తుంది. మన దేశ ఆలోచనా పద్ధతిలో ఉన్న విశేషమే అది. 'ఈ దేశం ధర్మ నిలయం. ఈశ్వరుని కార్యం ధార్మికమైన కార్యమే' అని మనం భావిస్తాం. రామ రావణ యుద్ధం సంగతి మనకు తెలిసిందే. రామునిది వానర సైన్యం. చెట్లు, రాళ్ళు రప్పలు తప్ప మంచి ఆయుధాలు లేవు. మరి రావణునికి చతురంగ బలముంది, రకరకాల ఆయుధాలున్నాయి. సర్వ సంపన్నమైన లంక ఉంది, అయినా విజయలక్ష్మి రాముని వరించింది. కురుక్షేత్ర సంగ్రామంలో పాండవ సైన్యంలో ఏడు అక్షౌహిణుల బలముంటే కౌరవుల సైన్యంలో పదకొండు అక్షౌహిణుల బలముంది. భీష్ముడు, ద్రోణాచార్యులు, కర్ణుడు, అశ్వత్థామ వంటి అతిరథ మహారథులున్నారు. అయినా పాండవులకే విజయం లభించింది. మన నమ్మకం కూడ అదే, ధర్మా ధర్మముల మధ్య జరిగే

సంఘర్షణలో అంతిమ విజయం ధర్మానిదే. మనం కూడ మన పనిని ధర్మ కార్యంగా స్వీకరించి, అంతిమ విజయం మనదే అనే విశ్వాసంతో విజిగీషు ప్రవృత్తితో ముందడుగు వేస్తాం.

మనం డాక్టర్జీ అనుయాయులం. డాక్టర్జీ గురించి మనకు బాగానే తెలుసు. సంఘాన్ని ప్రారంభించేటప్పటికి డాక్టర్జీ అతి సామాన్యమైన వ్యక్తి. కాంగ్రెస్ సంస్థలో పనిచేసే ఓ సామాన్య కార్యకర్త. 35 సంవత్సరాల వయస్సుంది. అయితే అఖిల భారతీయ నాయకుడనిపించుకోగల కోటీశ్వరుడో, లక్షాధికారో కారు. అలాగే ఆయనతో కలిసి పనిచేసేవారు ఎటువంటివారు? ఈనాడు సంఘ్‌లో ప్రముఖ కార్యకర్తలైన యాదవ రావుజీజోషి, బాలాసాహెబ్ దేవరస్, ఏకనాథ్‌జీ రానడే మొదలగు వారు ఆనాడు ఎటువంటివారు? పది పన్నెండు సంవత్సరముల బాలురు. అటువంటి వారి సహాయంతోనే, హిందూరాష్ట్ర పునః ప్రతిష్టతాను సాధిస్తానని డాక్టర్జీ చెప్పారు. అంతటి విశ్వాసంతో పనిచేసే డాక్టర్జీ అనుయాయులం మనం. డాక్టర్జీ ఒక్కరే. అతని అనుచరులేమో బాలురు (కిశోరులు). నేడు వేలకొలది శాఖలు, లక్షల మంది స్వయం సేవకులం ఉన్నామనుకోండి మన మనస్సులలో నిరాశకు తావుండకూడదు. సంఘ్ స్వయంసేవకులుగా మన మాటల్లో ఆశాభావం ప్రతిధ్వనించాలి.

డాక్టర్జీ మనముందుంచిన ఆదర్శం ఎటువంటిది? శివాజీ మహారాజు! శివాజీ పది గ్రామాలపై చిన్న జాగీర్దారు. మరి ఆయన ఎవరితో సంఘర్షణకు దిగాడు? పది పన్నెండు జిల్లాలపై ఆధిపత్యం వహించే ఆదిల్‌షాతో, భారత దేశంలో నాలుగింట మూడువంతులు తన అధీనంలో ఉంచుకున్న ఔరంగజేబుతో, హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించి చూపెడ్తానని శివాజీ శపథం పట్టాడు. తన జీవిత కాలంలోనే హిందూసామ్రాజ్యాన్ని స్థాపించి చూపించాడు. అటువంటి వ్యక్తుల జీవనం స్వయంసేవకులకు ఆదర్శం అయి

నందున స్వయంసేవకుల మాటల్లో నిరంతరం విజిగీషు ప్రవృత్తి ఆశా భావం, సమస్యలను పరిష్కరించి తిరిగి మనదేశాన్ని పరమవైభవస్థితికి తీసుకువెళ్తాం అనే విశ్వాసం ప్రతిధ్వనించాలి. అది మన రెండవ ప్రత్యేకత.

ఒక స్వయంసేవక్‌కు మరొక స్వయం సేవక్‌పై విశ్వాస శ్రద్ధా ఉండాలి. "నా ప్రవర్తన కారణంగా యితర స్వయంసేవకులకు సంఘ కార్యంపై విశ్వాసం సన్నగిల్లకూడదు" అనే విషయం స్వయం సేవకులు నిరంతరం మరచిపోకూడదు. దేశంలో ఆపత్కర పరిస్థితులలో ప్రజలకు స్వయంసేవకులే జ్ఞాపకం వస్తారు. అత్యయిక పరిస్థితి రోజులలో స్వయంసేవకులకు ధనమాశ చూపి సంఘ అధికారులను పట్టుకో వచ్చని పోలీసుశాఖ ఆశించింది. కాని వారి ఆశలు అడియాశలే అయ్యాయి. బీదవారైన స్వయం సేవకులుకూడ పోలీసువారికి లొంగలేదు. తమ కార్యకర్తల ఆచూకి తెలుపలేదు. మనలో మనకు విశ్వాసమే కాదు, ఇతరులకు కూడ స్వయంసేవకులపై అచంచల విశ్వాసముంది. ఒక కేంద్ర మంత్రి పరమపూజనీయ బాలాసాహెబ్‌జీని కలుసుకోటానికి ఒకసారి వచ్చారు. ఆయన పూర్వం ఐ.సి.యస్. అధికారికూడ. బాలాసాహెబ్‌జీతో ఆయన చెప్పారు: "ప్రతి కాగితం చదివి సంతకం పెట్టేటట్లయితే నేను రోజుకు ఒక్క కాగితంపైకూడ సంతకం పెట్టలేను." "అయితే మీరు కాగితాలు ఎంతవరకు చదువుతారు?" అని బాలాసాహెబ్‌జీ అడిగితే "నాకొక అసిస్టెంట్ ఉన్నాడు. అతను తెచ్చిన కాగితమల్లా నేను చదవకుండానే సంతకం పెడ్తాను. అతను సంఘ స్వయంసేవక్. థర్డ్ ఇయర్ ట్రైన్డ్. అతనిపై నాకు పూర్తి విశ్వాసముంది. అతను చెప్పినదల్లా నేను చేస్తాను" అని అన్నాడు. కాంగ్రెస్ పార్టీకి చెందిన మంత్రికి సంఘ స్వయంసేవక్‌పై పూర్తి విశ్వాసముంది.

VH-3

ప్రత్యక్షానుభవం ద్వారా నాకు కూడ కొన్ని విషయాలు తెలిసాయి. సంఘ్‌లోని స్వయంసేవకుల మధ్య ఉన్న విశ్వాసం, యితర సంస్థలలోని సభ్యుల మధ్య కనపడదు. నేను చాలా ఆలస్యంగా సంఘానికి వచ్చాను. 1942 క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో నేను కాంగ్రెసులో పని చేస్తుండే వాడిని. విద్యార్థిగా ప్రయాగ విశ్వ విద్యాలయంలో MSc చదువు తుండే వాడిని. ప్రయాగలో ఉండే ప్రసిద్ధులైన వారితో నాకు పరిచయం కూడ ఉండేది. పురుషోత్తమదాస్ టాండన్, లాల్‌బహాదూర్ శాస్త్రి, ఆచార్య కృపలాని మొదలగువారు ప్రయాగలోనే ఉండేవారు. ఆ తరువాత నేను సంఘంలో చేరి సంఘ్ కార్యకర్త అయినా పాత పరిచయాలు కొనసాగుతూనే వచ్చాయి. 1949 లో సంఘంపై నిషేధం తొలగించబడిన తరువాత నేను రెండు సంవత్సరాలు ప్రచారక్‌గా పనిచేయాలని విశ్వ విద్యాలయాన్ని వదిలిపెట్టాను. లక్నో ప్రచారక్‌గా నియమించబడ్డాను. అదే సమయంలో లాల్‌బహదూర్ శాస్త్రి ఉత్తర ప్రదేశ్ దేశీయాంగ మంత్రిగా ఉండేవారు. అప్పుడు సంఘ్‌పై అనేక నిందలు అన్యాయంగా ఆరోపింపబడ్తూ ఉండేవి. ముస్లిములపై సంఘ్ దాడి చేస్తోందని, మతకల్లోలాలు సృష్టిస్తోందని అబద్ధాలు ప్రచారం చేస్తుండేవారు. అందులో ఒక్కటీ నిరూపించబడ లేదనుకోండి. లాల్‌బహాదూర్ శాస్త్రి దేశీయాంగ మంత్రి (Home Minister) గా ఉన్నందున ఆయనను కలుసుకుని సంఘ్‌పై దుష్ప్రచారం ఏ విధంగా జరుగుతున్నది, పోలీసు నివేదికలలో కూడ ఏ విధంగా తప్పులున్నదీ వివరించే బాధ్యత నాపై పెట్టారు.

ఆ విధంగా నేను లాల్‌బహాదూర్ శాస్త్రిజీని కలుసుకునే వాడిని. ఆయన మంత్రి, నేను సాధారణ కార్యకర్తను. అయినా వారి అసాధారణ వ్యక్తిత్వం కారణంగా, సజ్జనులయినందున నేను వారిని తరచు కలుస్తుండే వాడిని. నవ్వుతూ, సరదాగా మాట్లాడేవారు. నన్ను అడుగుతుండే

వారు "మీకు తరచు బైఠక్‌లు జరుగుతుంటాయికదా! గటనాయక్ బైఠక్, గణశిక్షక్ బైఠక్, ముఖ్యశిక్షకుల బైఠక్, కార్యవాహల బైఠక్, ప్రచారకుల బైఠక్ యిలా జరిగే బైఠక్‌లలో ఏమి జరుగుతుంది" అని. సంఖ్య తీసుకుంటాం. శాఖల ఉపస్థితి ఎలా ఉంది? కార్యక్రమాలు ఏమి ఏమి జరుగుతున్నాయి? శిబిరంలో ఎంత సంఖ్య ఉంటుంది? ఎవరెవరు వస్తున్నారు? — ఈ విషయాలే చర్చిస్తాం అని నేను చెప్తే ఆయనకు నమ్మకం కుదిరేదికాదు? ఇన్ని బైఠక్‌లు పెట్టుకుని ఇంతమందిని పిలిచి ఊరికే శారీరక కార్యక్రమాలు మాత్రమే చర్చిస్తారా అనేవారు. అయితే మీరనుకుంటున్నారు. అంటే ముస్లింలపై, క్రైస్తవులపై ఎలా దాడిచేయాలని యోజన తయారు చేస్తుండవచ్చు అనేవారు అయితే మీరు ఏ బైఠక్ కైనా రండి ఏమిజరుగుతుందో చూడండి అనేవాణ్ని. నేను రాగానే మీరు సంఖ్య ఇచ్చి బైఠక్ స్వరూపమే మార్చివేస్తారు. అని ఆయన బదులు చెప్పేవారు. మా సంభాషణలు ఇలా సాగుతుండేవి. ఆ సమయంలో సర్‌సంఘ చాలకులైన పరమ పూజనీయ శ్రీ గురూజీ లక్నో కార్యక్రమం నిశ్చయమైంది.

సంఘ్‌పై వేయబడిన నీలాపనిందలు తొలగించటానికి, దుష్ప్రచారాన్ని ఎదిరించటానికి శ్రీ గురూజీతో నగరంలోని ప్రముఖులకు ఒక సమావేశం ఏర్పాటు చేయదలచుకున్నాం. ఆ సమావేశానికి ఆహ్వానించటానికి లాల్‌బహదూర్‌శాస్త్రి వద్దకు నేను వెళ్లాను. సంఘ్ స్వయం సేవకులు కాని యితరులకు ఒక సమావేశం ఏర్పాటుచేస్తున్నాము. మీరు తప్పకరండి. శ్రీ గురూజీని కలిసి సంఘ్ గురించి మీకున్న సందేహాలు తీర్చుకొనండి. నేను మీ కంటె చిన్నవాణ్ని. శ్రీ గురూజీ మీ సమవయస్కులు. అందువలన వారితో మీరు సామరస్య భావంతో మాట్లాడవచ్చు అనికూడ చెప్పాను. "శ్రీ గురూజీతో కలిసి మాట్లాడాలని నాకు కూడ చాలా కోరికగా ఉంది. ఆ శ్రేష్టవ్యక్తి గురించి నాకు చాలాతెలుసు. అయితే

కలుసుకునే అవకాశం మాత్రం యింతవరకు లభించలేదు. అయినా ఈ బైఠక్‌కు నేను రాలేను." అని ఆయన అన్నారు.

ఎందువలన అని నేను ప్రశ్నించాను. అప్పుడాయన ఇలా అన్నారు: "నేను మీ బైఠక్‌కు వస్తే కాంగ్రెస్ పార్టీలో సంచలనం ప్రారంభ మవుతుంది. లాల్‌బహదూర్ సంఘ్ వారితో కలసిపోయారు అంటారు" అని. "మీరు మన ప్రాంతంలో ఉన్న కొద్ది మంది పెద్దలతో ఒకరు. (సంపూర్ణానంద్, లాల్‌బహదూర్, సి. బి. గుప్తా, గోవిందవల్లభ పంత్ వంటి పెద్దలు 5, 6 గురే ఉన్నారు.) అటువంటి మీ గురించి అలా ఆలోచిస్తారా? నేను చాలాసార్లు మిమ్మల్ని కలవటానికి వస్తున్నాను. ఎప్పుడైనా కూర్చొని మాట్లాడటానికి తీరుబడిలేదు, నాతోపాటు కారులో రండి, ప్రయాణం చేస్తూ మాట్లాడుకుందాం అని మీరు అంటే మీతో తప్పక నేను కారులో వస్తాను. అప్పుడు స్వయంసేవకులెవరైనా నన్ను చూస్తే రజ్జూభయ్యా కాంగ్రెస్‌లో చేరబోతున్నారా అని అనుమానించరు.

కాంగ్రెసు వారికి సంఘ్‌పై లేనిపోని అనుమానాలున్నాయి. లాల్ బహదూర్ శాస్త్రీజీని కలిసి రజ్జూ భయ్యా సంఘ్ ఆదర్శాన్ని వివరి స్తున్నారు. అపోహాలు తొలగిస్తున్నారు అని భావిస్తారు" అని నేను చెప్పాను. దానికి బదులుగా ఆయన "మీరన్నదీ నిజమే. మీ సంఘ్‌లో ఒకరిపై మరొకరికి విశ్వాసం ఉంది. కాంగ్రెస్ పార్టీలో ఒకరిపై మరొకరికి అపనమ్మకం తప్ప మరొకటి ఉండదు" అన్నారు. అదే మన ప్రత్యేకత.

సంఘ్‌లో మనకు లభించే సంస్కారాలన్నీ శిబిరాలలో లభిస్తాయని మన నమ్మకం. చిన్న చిన్న బైఠక్‌లు, గటనాయకుల బైఠక్‌లు ఏర్పాటు

చేసేటప్పుడు చాలా చక్కగా ఏర్పాటు చేస్తాం. చివరకి మనకు అలవాటైంది ఏ పని చేసినా చక్కగానే చేస్తాం.

సమాజంలో సంఘ్‌పై మరొక విశ్వాసం కూడా ఉంది. సంఘ్ ఏ పనినైనా స్వీకరిస్తే దానిని సంపూర్ణంగా సమగ్రంగా సక్రమంగా చేసి పూర్తి చేస్తారు అనే నమ్మకం సమాజంలో ఉంది. ఆంధ్ర ప్రదేశ్‌లో కృష్ణా జిల్లా అవనిగడ్డ తాలూకాలో 1977 లో ఉప్పెన వచ్చి అపార నష్టం వాటిల్లింది. అందరికంటె ముందు సహాయ కార్యక్రమాలలో పాల్గొనడానికి అచ్చటికి స్వయం సేవకులు చేరుకున్నారు. నష్టం వాటిల్లిన గ్రామాల్లో ఒక దానిని పునర్నిర్మించాలని స్వయం సేవకులు నిర్ణయించారు. పునర్నిర్మిత గ్రామానికి దీనదయాళ్‌పురం అని పేరు కూడ పెట్టారు.

మనతోపాటు రామకృష్ణ మిషన్ వంటి సేవాసంస్థలు, పోలీసుశాఖ, ఎలక్ట్రిసిటి శాఖ వంటి ప్రభుత్వ శాఖలు కూడా పునర్నిర్మాణం కోసం తలా ఒక గ్రామాన్ని తీసుకున్నాయి. మనం అత్యంత శ్రద్ధతో త్రికరణ శుద్ధిగా పని చేసాం. ఎందరో కార్యకర్తలు రాత్రింబవళ్ళు శ్రమించారు. తత్ఫలితంగా దీనదయాళ్‌పురం యితర గ్రామాల కంటె ముందు తయారయింది. కేంద్రంలో అప్పుడు జనతా ప్రభుత్వముంది. ఆంధ్ర ప్రదేశ్‌లో ముఖ్యమంత్రి చెన్నారెడ్డి. అటల్ బిహారి వాజపేయి ప్రారంభోత్సవానికి రావడానికి అంగీకరించారు. వారు చెన్నారెడ్డిగారికి ఫోను చేసి చెప్పారు. అప్పుడు ఆయన ఇలా అన్నారు:

"మీరు నిర్మించిన దీనదయాళ్‌పురం ఒక్కటే తయారయింది. మిగిలిన సంస్థలు తలపెట్టిన గ్రామాల నిర్మాణం యింకా మొదట్లోనే ఉంది. అందువలన యితర సంస్థలకు చెడ్డపేరు వస్తుంది. అందుచేత 2, 3 నెలల తర్వాత రండి" అని చెప్పారు. "అటల్‌జీ విదేశాంగ మంత్రి. ఆయన

వస్తున్నారంటే ఎంతో వ్యవస్థ అవసరం. రోడ్లు ప్రస్తుతం బాగా లేవు. వాటిని బాగు చేయించాలంటే రెండు మూడు నెలలు పడుతుంది. కాబట్టి రెండు మూడు నెలలు ఆగమన్నాము'' అని పైకి చెపుతాం అన్నారు. మొత్తంమీద తేలిన విషయం సంఘమొక్కటే సకాలంలో పని పూర్తి చేయ గలిగింది. మోర్వీలోనూ, నాగపూర్ దగ్గరనూ వరదలు వచ్చినప్పుడు సంఘ్ చేపట్టిన సహాయ కార్యక్రమాలే సకాలంలో పూర్తి అయ్యాయి. చిన్నచిన్న పనులను అత్యంత శ్రద్ధతో సంఘంవాళ్ళు చేస్తారని ప్రతీతి.

ఆచార్య రంగా ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ప్రముఖ వ్యక్తి. యిప్పుడు కాంగ్రెస్ పార్టీ తరపున లోక్‌సభలో సభ్యుడుకూడ. ఒకప్పుడు స్వతంత్ర పార్టీ అధ్యక్షుడు. ఆయనను ఒకసారి విజయదశమి ఉత్సవానికి నాగ పూర్‌కు అధ్యక్షుడిగా ఆహ్వానించటం జరిగింది. అప్పుడు అధ్యక్షుడిగా వచ్చినవారే ధ్వజం ఎగరవేయటం మన పద్ధతి. ఆచార్య రంగా అధ్యక్షు లుగా ధ్వజాన్ని ఎగరవేశారు. చాలా తేలికగా ఎటువంటి యిబ్బందులు లేకుండా ధ్వజం పైకివెళ్ళింది. ఆ తరువాత శారీరక ప్రదర్శనలు, ఉపన్యా సాలు వగైరా జరిగాయి. ఆయనకూడ ప్రసంగించారు. ఆ తరువాత ఢిల్లీలో స్వతంత్ర పార్టీకి చెందిన కార్యకర్తలు కొందరు ఆయనను కలుసు కుని కార్యక్రమం ఎలా జరిగింది మీకు అందులో ఏమి నచ్చింది అని అడిగారు. అప్పుడు ఆయన చెప్పిన సమాధానం "సంఘం వాళ్ళు ఏమి చేసినా చాలా చక్కగా చేస్తారు.

చిన్న చిన్న విషయాలపట్ల కూడ ఎంతో శ్రద్ధ కనబరుస్తారు. ఉత్సవంలో ధ్వజాన్ని నేను ఎగురవేశాను. అది ఎటువంటి యిబ్బంది లేకుండా జరిగింది. మన స్వతంత్ర పార్టీ సమావేశాలలో మనం కూడా ధ్వజాన్ని ఎగురవేస్తాం కదా! ఎప్పుడైనా యిబ్బంది లేకుండా దానిని

ఎగురవేశామా? అసలు పైకి ఎక్కదు. మధ్యలో ఆగిపోతుంది. ఎక్కితే క్రిందకురాదు. సంఘ్ వారినుండి జెండా ఎగరవేయటంలో మనం శిక్షణ పొందాలి" అని. చిన్న చిన్న విషయాలు కూడ చూడాలనిపించేటట్లు ఉంటాయి. వ్యవస్థ విషయంలో మనం తీసుకునే శ్రద్ధ అటువంటిది.

ఇరవై వేల మందితో కర్ణాటకలో ఒక శిబిరాన్ని నిర్వహించాం. బెంగుళూరులో జరిగిన ఆ శిబిరం యొక్క వ్యవస్థను చూచి అందరూ ఎంతో మెచ్చుకున్నారు. 35 వేల మందితో మహారాష్ట్రలో శిబిరం నిర్వహించ బడింది. అప్పుడు కూడ వ్యవస్థ బాగా జరిగింది. అందరూ మెచ్చుకున్నారు. అందుకనే సంఘం వాళ్లు ఏ పనినైనా తీసుకుంటే దానిని బాగా చేస్తారనే పేరుకూడ వచ్చింది.

యితర కార్యక్రమాలలో కూడ మంచి వ్యవస్థ చేయబడటం మనం చూస్తున్నాం కదా అని మీరు అనవచ్చు. నిజమే. ఢిల్లీలో జరిగిన ఆసియా క్రీడోత్సవాల వ్యవస్థ బాగానే ఉంది. అయితే అచ్చటి వ్యవస్థను సైన్యం చేసింది. అలీన రాజ్యాల సమావేశం (NAM) జరిగినప్పుడు వ్యవస్థ బాగానే ఉంది కదా అని మీరనవచ్చు. అయితే అప్పటి వ్యవస్థను ఐ.ఎ.యస్. అధికారులు మన దేశ పరిపాలనా వ్యవస్థలో ఉన్నతస్థాయిలో ఉన్నవారు చేశారు. కాంగ్రెస్ మహాసభల వ్యవస్థ ప్రభుత్వ సహాయంతో జరుగుతుంది. ఈ మధ్య బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ శతజయంతి ఉత్సవాల వ్యవస్థ గురించి మీరు వినే ఉంటారు.

ఇంకొక అనుభవం మీకు చెప్పాలి. శ్రీ యు. ఎన్. ధేబర్ పేరు మీరు వినే ఉంటారు. కొంతకాలం ఆయన కాంగ్రెస్ అధ్యక్షులుగా పని చేశారు. ఆయన పార్టీ పనిమీద గద్వాల్ జిల్లాలో పర్యటించారు. కార్యక్రమం కూడ ఏర్పాటు చేయబడ్డది. అచ్చట సంఘ్ కార్యకర్తలకు జన

సంఘ్ కార్యకర్తలకు కాంగ్రెస్ వారితో పరిచయముంది. అందువలన వారిని తమాషా చేద్దామనే ఉద్దేశ్యంతో "ఢేబర్‌గారు మంత్రి పదవిలో లేరు కదా! యిప్పుడు ప్రభుత్వ యంత్రాంగం మీకు పని చేయదు. ఖర్చంతా మీరే భరించాలి.

ఎలా వ్యవస్థ చేస్తారో?" అని మన కార్యకర్తలన్నారు. దానికి వారు "అబ్బే, మేము ప్రభుత్వం మీద ఆధారపడిలేము. మంచి వ్యవస్థ మేమే చేయగలం" అని సమాధానం చెప్పి ఒక పెద్ద మైదానంలో ఎన్నో ట్యూబ్‌లైట్లను పెట్టించి లౌడ్ స్పీకర్లను పెట్టించారు. 20 వేల మంది కోసం పెద్ద బహిరంగసభ. అయితే సభ ప్రారంభం కాగానే విద్యుచ్ఛక్తి సరఫరా ఆగిపోయింది. ట్యూబ్‌లైట్లు ఆరిపోయాయి. మైక్ పనిచేయటం ఆగిపోయింది. పెట్రోమాక్స్ లైట్ల వ్యవస్థ కాని, బ్యాటరీ వ్యవస్థ కాని, జనరేటర్ వ్యవస్థ కాని లేదు. ప్రజలకు ఏమీ కనపడటంలేదు, వినపడటం లేదు.

ప్రజలు కూర్చున్నవారు లేవటం ప్రారంభించారు. కార్య నిర్వాహకులకు అప్పుడు గుండెదడ ప్రారంభమై పెట్రోమాక్సు లైట్లకోసం అటూ ఇటూ [illegible] తెప్పటానికి అరగంట పట్టింది. సభలో [illegible] కూర్చో బెట్టి తీసుకువచ్చారు. [illegible] అయితే లైట్లు పోయేటప్పటికి వాళ్ళంతా లేచిపోయారు. ముందు వంతుల [illegible] వేసిన [illegible] [illegible] [illegible]

కార్యకర్తలకు ఎవరిని తిట్టాలో తెలియలేదు. అందువలన సంఘ కార్యకర్తలపై దుమ్మెత్తి పోశారు. "వీళ్ళే మాకు విద్యుచ్ఛక్తి సరఫరా ఆగిపోయేటట్లు చేశారు. ప్రజలు జంపఖానాలు, ట్యూబ్ లైట్లు ఎత్తుకుపోయేటట్లు చేశారు" అని నిందించారు. వాస్తవానికి తమ వ్యవస్థలో లోటుపాట్లున్నాయి. జనరేటరు గురించి, పెట్రోమాక్సు లైట్ల గురించి ముందుగా తామూహించలేదని వారు భావించలేదు.

చిన్న పనైనా ఎవరికి యిస్తే వారు దాని మీద అత్యంత శ్రద్ధ వహించటం మన ప్రత్యేకత. జంపఖానాలు తీసుకురావటం కావచ్చు, నీళ్లు తీసుకురావటం కావచ్చు, భోజన వ్యవస్థ లేదా అల్పాహార వ్యవస్థ కావచ్చు. ఏదైనా ఏకాగ్ర చిత్తంతో చేయటం మనం నేర్చుకున్నాం. అందువలన మనం మన పనిలో విజయాన్ని సాధిస్తున్నాం. మనపై ప్రజలకు నమ్మకము కుదురుతోంది. సంఘ వారికి ఏ పని యిచ్చినా సక్రమంగా చేస్తారు. దేశానికి సంబంధించిన ఏ పనినైనా సక్రమంగా చేస్తారు అని ప్రజలు భావిస్తున్నారు.

సంఘ అధికారులు యిచ్చే ఉపన్యాసాల వలన, వివరించే సిద్ధాంతం వలన సమాజం ప్రభావితం అవుతోందని అనుకోవద్దు. సంఘ అధికారులు ఉపన్యాసం బాగానే యిస్తారు. మన సిద్ధాంతం చాలా గొప్పది. అయినా సంఘం పెరగటానికి కారణం స్వయంసేవకుల నడవడికే. స్వయంసేవకుల వ్యవహారాన్ని ప్రతి యొక్కరు చూస్తూనే ఉంటారు. "నేనొక [illegible] చూస్తారు అని అనుకోవద్దు. సంఘ్. [illegible] ప్రతి స్వయంసేవకుని నడవడికను [illegible] ఎంత [illegible], [illegible]

అను శాసన బద్ధమైనదీ, మనలో దేశభక్తి ఎంత ఉన్నదీ- యిలా ప్రతిదీ సమాజం పరిశీలిస్తూనే ఉంటుంది. సంఘం కార్యం మనందరి కారణంగా పెరుగుతుంది.

ఒక గంట సంఘశాఖలకు వెళ్తున్నాం. ఆగంట అనుశాసనం పాటిస్తాం. ఆ తరువాత వేరేవిషయం అంటే కుదరదు. మనం అధ్యాపకుల మనుకోండి. శాఖలో గడిపే గంట సమయం బాగా ఉంటాం. ఆ తరువాత కర్తవ్యపాలన గురించి ఆలోచించం అంటే సరిపోదు. తాము పనిచేసే రంగాలలో స్వయం సేవకులు ఆదర్శప్రాయులు కావాలి. స్వయంసేవక్ వ్యాపారస్థుడైతే అతని దుకాణంలో కల్తీలేని వస్తువులే అమ్మాలి. తూకంలో మోసం ఉండకూడదు. చిన్నపిల్లలు వచ్చినా, ముసలివారు వచ్చినా ఎటు వంటి మోసం జరుగకూడదు. స్వయంసేవక్ ఉపాధ్యాయుడైతే నిరంతరం విద్యార్థుల శ్రేయస్సు గురించే ఆలోచిస్తూ పాఠాలు చక్కగా బోధిస్తాడు. స్వయం సేవక్ యితరులతో మధురంగా వ్యవహరిస్తాడు. తన పనిని నిష్ఠతో కష్టపడి చేస్తాడు.

ఎవరైనా పనిని చక్కగా చేస్తుంటే, అతని వ్యవహారం మృదు మధురంగా ఉంటే అతను స్వయంసేవక్ అయి ఉండవచ్చని ప్రజలు భావిస్తున్నారు.

ఢిల్లీలో మన స్వయంసేవక్ ఒకసారి ఒక బ్యాంక్‌కు వెళ్లాడు. డ్రాఫ్టు తీసుకోటానికి వెళ్లాడు. అతను ఒక కిటికీ దగ్గరకు వెళ్ళి నేను డ్రాఫ్టు తీసుకోవాలి అన్నాడు. సాధారణంగా అని డ్రాఫ్టులకు సంబంధించిన కిటికీ కాకపోతే అక్కడున్న గుమాస్తా ఇక్కడకాదు అంటాడు. మ ఎక్కడ అని అడిగితే ఇది ఎంక్వయిరీ కిటికీ కాదు, అన్ని విషయాలూ చెప్పటానికి నాకు వేరే పనిలేదా అంటాడు. కాని ఢిల్లీలో ఆ బ్యాంకులో

స్వయంసేవక్ వెళ్ళి డ్రాఫ్టు కట్టాలని అడిగిన కిటికీ దగ్గర కూర్చున్న వ్యక్తి చాలా నెమ్మదిగా అది డ్రాఫ్టులు కట్టే కిటికీ కాదనీ, అయిదో నంబరు కిటికీ వద్ద పటేల్ అనే వ్యక్తి పల్ అనే వ్యక్తి డ్రాఫ్టుల విషయం చూస్తాడని చెప్తూ మీకేమైనా యిబ్బంది కలిగితే నా దగ్గరకి రండి నేను సహాయం చేసి పెడతానన్నాడు. ఈ వ్యవహారమంతా చూసి డ్రాఫ్టులు తీసికొనడానికి వెళ్ళిన వ్యక్తి ఆ గుమాస్తా తప్పకుండా స్వయం సేవక్ అయి ఉంటాడని నాతో చెప్పటం జరిగింది.

అందువలన మనమంతా గుర్తించుకొనవలసిన విషయమిది. మన మంతా సంఘ్ ప్రచారకులం. ఇరవై నాలుగు గంటలూ సంఘ్‌పని చేస్తాం కాబట్టి ప్రచారకులం కాదు. ఇరవై నాలుగు గంటలూ సంఘ్ స్వయంసేవకు లుగా వ్యవహరిస్తాం కాబట్టి ప్రచారకులం. కేవలం ఒక గంట మాత్రమే స్వయంసేవకులం కాదు. ఇరవై నాలుగు గంటలూ మనం వ్యవహరించే తీరునుబట్టి సంఘ్ ప్రతిష్ట పెరుగుతుంది. సంఘ్ సుగంధం నాలుగు దిక్కులా వ్యాపిస్తుంది. ఇలా నిత్యమూ ప్రతిక్షణమూ వ్యవహరించే లక్షల కొలది స్వయంసేవకుల కారణంగా సంఘ్ ప్రచారం జరుగుతుంది. ఈ విషయాన్ని మనం నిరంతరం జ్ఞాపకముంచుకోవాలి.

# హిందూ సంఘటన అంటే ?

## (బాల స్వయంసేవకుల నుద్దేశించి చేసిన ప్రసంగం)

సంఘానికి రెండు సిద్ధాంతాలున్నాయి. అవి ఏమిటి?

సమయపాలన మరియు క్రమశిక్షణ : ఇవి సిద్ధాంతాలుకావు సంఘం నేర్పే పాఠాలు.

దైనందిక శాఖ : ఇది కార్యపద్ధతి. సిద్ధాంతం కాదు

వ్యక్తి నిర్మాణము : ఇదికూడా కార్యపద్ధతే, వ్యక్తునిర్మాణంచేయాలి.

పరమ వైభవం : ఇది సంఘం యొక్క లక్ష్యము. ఈ దేశాన్ని పరమవైభవ స్థితికి చేర్చటము లక్ష్యము. సిద్ధాంతము కాదు.

ఆజ్ఞాపాలన : ఇది చాలా ముఖ్యమైన విషయం. ఇంట్లో కూడా నేర్పబడుతుంది.

సంఘానికి ఒక సిద్ధాంతముంది. భారత్ అనీ, హిందుస్థాన్ అనీ పిలవబడే ఈ దేశము హిందువులది. భారత్ హిందు రాష్ట్రము. ఇది మొదటి సిద్ధాంతము దీనిని కొందరు అంగీకరించరు. ఈ దేశము అందరిదీ అని వాళ్ళంటారు. హిందువులదీ దేశము అని మనమంటాము. ఇక్కడ వేల సంవత్సరాలనుండి హిందువులు నివసిస్తూన్నారు. ఇక రెండవ సిద్ధాంతము: సంఘటనలో శక్తి ఉన్నది అని. మనమొక ఆట ఆడుతుంటాము. సంఘటక్ మేం శక్తిహై, సంఘటక్ మేం శక్తిహై అని అరుస్తూ కూత పోకుండా

తిరుగుతుంటాము. కూతపోయినప్పుడు మనము కూర్చోవలసి వస్తుంది.
ఇది మన సిద్ధాంతాన్ని గుర్తుంచుకోడం కోసం ఆడే ఆట. ఈ రెండు విష
యాలను గూర్చి ఆలోచిద్దాము.

భారత్ హిందు రాష్ట్రము, ఈ దేశము హిందువులది- సంఘటనలో
శక్తి ఉన్నది - అనే ఈ రెంటిని కలిపి ఒకటి చేసి 'హిందు సంఘటన'
అని మనము చెపుతుంటాము. పప్పు, బియ్యము వేరైనా, కలిపి ఖిచిడీ
(పొంగలి) చేసినప్పుడు రుచిగా ఉన్నట్లు 'హిందు సంఘటన సంఘ
సిద్ధాంతము' అనడం పై రెండు సిద్ధాంతాల సమాహారము మాత్రమే. ఇది
హిందువుల దేశమని మనము ఎందుకు చెప్తున్నాము. ఇది మన దేశ
మైనందున, దేశానికి కలిగే లాభమేమిటి? అని మనము కొంచెము ఆలో
చిస్తే, మనదేశముకోసము మనము పనిచేయవలసి ఉంటుందని అర్థ
మౌతుంది. ఎవరి మనస్సులో ఇది నాదేశము, నా తండ్రి, తాతల దేశము,
ఇక్కడే తరతరాలుగా మేము నివసిస్తూవున్నాము. ఇది తప్ప నాకు వేరే
మరే దేశము లేదు, అనే భావన ఉండదో, అతడు ఈ దేశము కోసము పని
చేయడు. ఈ భావన ఉన్నవానిలో పనిచేయడానికి ప్రేరణ ఉంటుంది.
దీనికొక చిన్న ఉదాహరణ ఇస్తాను.

మీరు సైకిలు మీద ఎక్కడికో వెళ్తున్నారు. వెళ్ళేటప్పుడు
దారిలో ఒక స్త్రీని ఇద్దరు గూండాలు అల్లరిపెట్టడం చూచారు. ఇది
అన్యాయం. ఆమెకు సహాయం చేయాలని మీకనిపిస్తుంది. కాని, ఆ మరు
క్షణంలో - గుండాలిద్దరున్నారు, నేనొక్కడినే గదా అని, ఒంటరిగానే
సహాయం చేయాలనుకుంటే, గూండాలదగ్గర చాకుగాని, పిడి బాకుగాని
ఉన్నదేమో, నన్ను పొడిచేస్తారేమో, వీళ్ళని పట్టిస్తే పోలీసు స్టేషన్‌కు
వెళ్ళవలసి వస్తుంది, అక్కడ చాల కష్టాలుంటాయి; పోలీసులు చాల

బాధలు పెడతారు. మళ్ళామళ్ళా రమ్మంటారు - అనుకొని, నేను నా పని మీద వెళ్ళితే మరెవరైనా ఈమెకు సహాయము చేయగలరు లెమ్మని వెళ్ళి పోతుంటారు. ఆ అల్లరి పెట్టబడుతున్న స్త్రీ మీ తల్లిగాని, సోదరిగాని అయితే అప్పుడు మీరు గుండాలిద్దరు, నేనొక్కడినే అని ఆలోచించరు, పోలీసు ఠానాకు వెళ్ళవలసి వస్తుందే అని ఆలోచించరు. ఎటువంటి ఆలోచనలు చేయకుండా ఆమెకు సహాయము అందించడానికి పరుగులెత్తు తారు. ఇప్పుడెందుకు పరుగెత్తారు? ఇంతకుముందు ఎందుకు పరుగెత్తలేదు? దానికి కారణము ఈమె నా తల్లి, ఈమె నా సోదరి అనే భావన మనస్సులోకి రావడమే. తనది అనే భావన రావడంతోనే మనుష్యుడు పనిచేస్తాడు. ఆ ఆత్మీయ భావం లేకుంటే, పని చేయడు. ఎవరో స్త్రీ అనుకున్నపుడు హృదయంలో ఆత్మీయ భావం ఏర్పడదు. అలాగే ఈ దేశము అందరిదీ, ఇక్కడ ముస్లిములు, క్రైస్తవులు, రకరకాల వాళ్ళు నివసిస్తున్నారు. అందరూ ఈ దేశంకోసం పనిచేయాలి అని ఇతరులంటుంటారు. ఇది మా దేశము, మా మాతృభూమి. ఇది హిందువుల దేశము. మేము హిందువులము. మాకు ఈ దేశంతో అవినాభావ సంబంధమున్నందున ఈ దేశము కోసము మేము పనిచేస్తామని మనమంటాము. ఇది మా దేశము, ఇది మా రాష్ట్రము అని మనము చెప్పినప్పుడు మనలో క్రియాశీలత మేల్కొంటుంది. మనమే ఈ దేశంకోసం పని చేయాలి అనే భావన మనలో జాగృతమౌతుంది.

రెండవ సిద్ధాంతము 'సంఘటనలో శక్తి ఉన్నది.' ఇది కూడ మన దేశంలో ప్రచారంలో ఉంటూ వచ్చింది. పూర్వకాలంలో మనదేశం అంతా కలిసికట్టుగా ఉంటూ వచ్చింది. ఆరోజుల్లో వచ్చిన ఆక్రమణకారులు చాల బలవంతులైనప్పటికీ, మనము సంఘటితంగా ఉన్నందున వారిని ఓడించగలిగాము. అందరికంటె ముందు ఈ దేశంమీద ఆక్రమణ జరపడానికి వచ్చిన

వాడు అలెగ్జాండర్, బాబర్ అనే ముసల్మాన్ 400 సం॥ల పూర్వంవస్తే, సుమారు 2500 సం॥లకు పూర్వం ఇక్కడకు ఆక్రమణ చేయడానికి అలెగ్జాండర్ వచ్చాడు. ఆనాడు మనదేశం సంఘటితంగా ఉండింది. చంద్రగుప్తుడు, చాణుక్యుడు - వీరిద్దరూ కలిసి గ్రీకులను ఓడించారు. చాల పూర్వ కాలంలో ఈ దేశము మీద రెండవ దురాక్రమణ జరిగింది. అది శకుల దురాక్రమణ. మధ్యఆసియా ప్రాంతం నుండి సుమారు 2000 సంవత్సరాలకు పూర్వము వీరు వచ్చారు. భారత దేశంలో చాల భాగాన్ని జయించారు. అయితే మన దేశంలోని కొందరు వీర పురుషులు వారిని ఓడించారు. శకులను పరాజితులను చేసిన మహావీరుడు శకారి విక్రమాదిత్యుడు. శకారి అంటే శకులకు శత్రువు అని అర్థము. అలాగే మూడవ ఆక్రమణ ఈ దేశం మీద జరిగింది. చాల పెద్ద సంఖ్యలో హూణులు ఈ దేశం మీద దాడి చేశారు. ఆనాడు మన దేశము సంఘటితంగా, ఒకటిగా ఉన్నందున హూణులను కూడ మనము పరాజితులను చేశాము. స్కందగుప్తుడు మొదలైనవారు అనేకులు హూణులతో యుద్ధం చేశారు. కాని వాళ్ళను పూర్తిగా ఓడించిన వారి పేరు మనము గుర్తుంచుకుంటాము. ఆయనే మన ఏకాత్మతాస్తోత్రంలో వచ్చే హూణ జేత యశోధర్మ. మనము సంఘటితంగా ఉన్నపుడు గ్రీకులను, శకులను, హూణులను ఓడించాము.

ఎప్పుడు ఐకమత్యము కోల్పోయి, మనలో మనము కలహించుకో సాగామో, ఆనాడు చిన్న చిన్న రాజ్యాలుగా చీలిపోయాము. రాజస్థాన్ లోనే ఐదారు రాజ్యాలైనాయి. జయపూర్, జోధపూర్, ఉదయపూర్, అజ్‌మేర్ లాంటి అనేక రాజ్యాలు. అలాగే మహారాష్ట్రంలోను, ఆంధ్రలోను అనేక రాజ్యాలైనాయి. అప్పటి నుండి మనము ఓడిపోయాము. సంఘటన ఉన్నప్పుడు గెలిచాము. సంఘటన చెదరిపోయినప్పుడు ఓడిపోయాము. అందువల్ల మన రెండవ సిద్ధాంతము 'సంఘటనలో శక్తి ఉన్నది' మనము

హిందు సమాజాన్ని సంఘటితం చేసినప్పుడు ప్రపంచంలో ఎవ్వరు కూడ మనలను జయించలేరు. మనమంతా హిందువులం - మనమంతా కలిసి ఉండాలి - శాఖకు వెళ్ళటం మూలాన ఇది జరుగుతుంది- మనము శాఖకు వెళ్ళడం అవసరము అని మనకీ ఆలోచనలు మెల్లమెల్లగా, ఒకప్పుడు ఆటల్లో, మరొకప్పుడు మాటల్లో వస్తుంటాయి. మనము శాఖకు వెళ్ళడం ఎంత అవసరమో తెలపడానికి ఒక చిన్న కథ చెపుతాను.

ఉత్తర ప్రదేశ్‌లో ఒక ఊళ్ళో 20 సంవత్సరాల యువకుడు ఒక డుండేవాడు. అతనికొక 5 సంవత్సరాల చిన్న తమ్ముడు. అన్న అనుకున్నాడు "నా దగ్గర ఎక్కువ డబ్బు లేదు. భూమికూడ ఎక్కువ లేదు. ఈ యింట్లో అన్నదమ్ములము మేమిద్దరము పెరిగి పెద్ద అయినప్పుడు, 3, 4 ఎకరాల చాలా కొద్ది భూమితో పొట్ట నింపుకోవడం కష్టం." అందుకని ఆయన ఏదైనా పనిచేయడం కోసం బొంబాయికి వెళ్ళాడు. తమ్ముడు ఇంట్లోనే ఉండిపోయాడు. క్రమంగా 15, 20 సంవత్సరాలు గడిచాయి. తమ్ముడు కూడా ఇప్పుడు 20 సం॥ల యువకుడయ్యాడు. అన్నకు 40-45 సం॥ల వయస్సు వచ్చింది. ఇంతలో వాళ్ళ ముసలి తండ్రి చనిపోయాడు. ఆ సందర్భంగా బొంబాయి నుండి అన్నగారిని పిలిపించాలి. 20 సంవత్సరాలుగా బొంబాయి నుండి ఆయన రాలేదు. తమ మీద ఏదైనా కోపము వచ్చిందేమో. కనుక స్వయంగా బొంబాయి వెళ్ళి అన్నగారిని వెంటతీసుకొని రావాలి అని తమ్ముడనుకున్నాడు. తండ్రిగారి మరణ వార్త అందగానే అన్నగారి మనస్సులో 'తమ్ముడు ఒంటరిగాడు. తండ్రిగారు పోయారు. ఇప్పుడు నేను ఇంటికి తిరిగి వెళ్ళి అతని బాగోగులు చూడాలి' అని అనుకున్నాడు. ఈ విధంగా ఒకవైపు అన్నగారిని వెంట తీసుకెళ్ళడానికి తమ్ముడు బొంబాయికి బయలుదేరితే, మరొకవైపు తమ్ముని కలుసుకోడానికి అన్న యింటికి బయలుదేరాడు.

సోదరులిద్దరు అతి విచిత్రంగా వారిలో కలుసుకున్నారు. వారిలో చిత్ర కూటమనే తీర్థస్థానమున్నది. దానికి దగ్గర్లో ఒక జంక్షన్. ఉత్తరప్రదేశ్ నుండి బొంబాయి వెళ్ళేబండి అక్కడ ఆగుతుంది. అక్కడనుండి బండి మారి చిత్రకూటము వెళ్ళాలి. బొంబాయినుండి ఉత్తరప్రదేశ్ వెళ్ళే బండి కూడ అక్కడ ఆగుతుంది. చిత్రకూటము వెళ్ళడానికి అక్కడ బండి మారాలి. మొదట తమ్ముని బండి అక్కడకు చేరింది. అతడు బండి దిగి, చిత్రకూటము వెళ్ళే బండిదగ్గరకు వెళ్ళాడు. అది ఖాళీగా ఉంది. దాంట్లోకి ఎక్కి విశ్రాంతిగా పడుకున్నాడు. కొంతసేపటికి బొంబాయి సోదరునిబండి వచ్చింది. దానినుండి అన్నగారు దిగి, ఎలాగూ ఇంటికి వెళుతున్నాను, చిత్రకూటము వెళ్ళి చూచివెళ్తాను అనుకొని అతడుకూడ ఆ బండి ఎక్కాడు. స్థలముకోసము ఇక్కడా అక్కడా చూచి, ఎక్కడా దొరక్క, ఈ 20 యేండ్ల యువకుడు పీటంతా ఆక్రమించి పడుకున్న చోటికివచ్చి "కొంచెం కాళ్ళు ముడుచుకో, ఇంకెక్కడా స్థలము దొరకలేదు. నేనుకూడ ఈ బండ్లో వెళ్ళాలి" అని అన్నాడు. పడుకున్నవాడు లేవకుండానే ఆ సోదరుడు "ఇక్కడ చోటులేదు మరెక్కడైనా చూచుకోండి" అన్నాడు. వాళ్ళు ఇద్దరూ ఒకరినొకరు గుర్తుపట్టలేదు. అన్నగారు కొంచెంసేపు తిరిగి చూచి మళ్ళా అతనితో "చోటు ఎక్కడా లేదు. నీవూ టిక్కెట్టు తీసుకున్నావు. నేనూ టిక్కెట్టు తీసుకున్నాను. నేను ఇక్కడే కూర్చుంటాను" అన్నాడు. తమ్ముడు యువకుడు గదా! కొంచెం కఠినంగా "అలాగా, కొంచెం కూర్చొని చూడు" అన్నాడు. అన్నకు 45 ఏండ్లు అయినా, అతని శరీరములోకూడ బలమున్నది. దభీలున తన పక్క చుట్ట అతని కాళ్ళమీద పడేసి అతని పాదాలమీద కూర్చున్నాడు. అప్పుడు తమ్ముడు లేచి నిలబడ్డాడు. ఒకరినొకరు గుర్తించలేదు. వారిద్దరి మధ్య పోట్లాట ప్రారంభమైంది. గట్టిగా తిట్టుకున్నారు. ఒకరు కాలరు పట్టుకుంటే, మరొకరు చెయ్యి

పట్టుకున్నారు. దెబ్బలాట జరగబోయింది. ఇంతలో ఒక విశేషం జరిగింది. తమ్ముడు బొంబాయి ఇంతకుముందెప్పుడూ వెళ్ళలేదు. బొంబాయిలో అన్న గారిని గుర్తుపట్టడం ఎలా? ఎక్కడుంటున్నాడో తెలుసుకోవడం ఎలా? అని తనతోపాటు తన ఊరునుండి ఒక ముసలివానిని తీసుకవెళ్ళాడు. ఆ ముసలివాడు పూరీవగైరా తిని నీళ్ళు త్రాగడానికి స్టేషన్‌లో దిగాడు. అతడు లోపలికి రావడంతోటే, ఈ యిద్దరూ దెబ్బలాడుకోవడం చూచాడు. అతడు పెద్దవాడైనందున ఇద్దరికీ నచ్చజెప్పాడు. అతడు తమ్మునితో "దారిలో జగడాలు పెట్టుకోకు. ఇతనికి టిక్కెట్టు ఉంది. కూర్చోనీయి" అని చెప్పి దెబ్బలాట ఆపేసాడు. ఇప్పుడు ఇద్దరూ శాంతంగా కూర్చున్నారు కాని, ఒకరిపట్ల ఒకరు కోపంతో వీలుచిక్కితే పోట్లాడుకుంటారా అన్నట్లున్నారు. ఇంతలో ముసలివాడు సంభాషణ ప్రారంభించాడు. తమ్ముడు ఎలాగూ తెలుసు గనుక పెద్దవానితో "బాబూ, మీరు ఎక్కడినుండి వస్తున్నారు? ఎక్కడికి వెళుతున్నారు?" అని అడిగాడు.

"నేను బొంబాయినుండి వస్తున్నాను. ప్రతాప్‌గఢ్ జిల్లాలో ఒక ఊరు మాది, అక్కడికి వెళ్తున్నాను."

"ఏ ఊరు?"

"అక్బర్‌పూర్."

"మేముకూడ అక్బర్‌పూర్ వాళ్ళమే" అని తమ్మునితో "ఈయన మన ఊరువాడే. మన ఊరువానితోనే దెబ్బలాడడం ఏమీ బాగాలేదు" అన్నాడు.

"అక్బర్‌పూర్ ఎందుకోసం వెళ్తున్నారు? గ్రామంలో ఏమిపని?" అని ముసలివాడు సంభాషణ కొనసాగించాడు. దానికి పెద్దసోదరుడు-

"భాయీ, మా తండ్రిగారు అక్కడ ఉండేవారు. వారు స్వర్గస్థులయ్యారు. నాకొక చిన్నతమ్ముడున్నాడు. అతడు పెరిగి పెద్దవాడై ఉంటాడు. ఒంటరిగాడు. అందుకని వెళ్తున్నాను."

"మీ తండ్రిగారి పేరేమి?"

తండ్రిగారి పేరు చెప్పగానే తమ్ముడు "ఈయన నా అన్న-బొంబాయినుండి వస్తున్నాడు" అని తెలుసుకున్నాడు. వెంటనే ఆయన పాదాలమీదపడి "నన్ను మన్నించండి. మిమ్ములను గుర్తించలేను. మీతో పోట్లాడాను. మిమ్మ దూషణగా మాట్లాడాను. మీ కాలరు పట్టుకున్నాను. నిజానికి మీరు నా అన్నగారు. మిమ్ములను కలుసుకోడానికే బొంబాయికి వెళ్తున్నాను" అని ప్రాధేయపడ్డాడు. ఇక అన్నగారు "అసలు తప్పంతా నాది. నేను ఇలాగా పోట్లాడవలసింది కాదు. నీవు చిన్నవాడివి. నేను పెద్దవాడిని. నాకు 40-45 సం॥ల వయస్సు. నెమ్మదిగా, తెలివిగా పనిజరిపించుకోవలసింది నీతో దెబ్బలాడాను. అందుచేత నన్ను క్షమించు." ఈవిధంగా అన్నదమ్ములిద్దరూ ఎంతో ప్రేమగా రైలులో ప్రయాణంచేసి చిత్రకూటము చేరుకున్నారు. గుర్తింపులేని కారణాన సోదరులు చిన్నచిన్న విషయాల మీద పోట్లాడారు. తెలుసుకున్న తర్వాత సోదరులమధ్య ఎంత ప్రేమ! ఒకరికోసమొకరు సీటంతా ఖాళీ చేయడానికి సిద్ధమయ్యారు. తమ్ముడు "మీరు బొంబాయినుండి వస్తున్నారు. మీకు అక్కడ సీటుదొరికి ఉండదు. నిద్రవస్తూ ఉంటుంది. మీరు పడుకోండి. మీ కాళ్ళు ఒత్తుతాను" అని అంటే, అన్నగారు "నీవు యువకుడివి. నీకు నిద్ర ఎక్కువ కావాలి. నీవు పడుకో. నేనీ అంచుమీద కూర్చుంటాను" అన్నాడు. ఇలాగా సోదరులిద్దరూ ఆప్యాయతతో మాటామంతీ చెప్పుకున్నారు. ఈ ఇద్దరికీ మధ్య అనురాగాన్ని కలిగించినవాడు ఆ ముసలివాడు. అతడే లేకుంటే ఇది జరిగి ఉండేదికాదు.

వాళ్ళ యింటి విషయాలు, తల్లిదండ్రుల పేర్లు, ఊరుపేరు అడిగేవాడు లేకుండా ఉండి ఉంటే, ఆ యిద్దరు సోదరులు మళ్ళా బాగా పోట్లాడుకునే వాళ్ళు.

మనముకూడ మనదేశములో పరస్పరము కలహించుకుంటున్నాము. మన మంతా సోదరులమని మనకు మళ్ళా గుర్తు చేసే ఆ ముసలివాడు కావాలి. ఆ ముసలివాని ఆగమనముతోనే మనమంతా ఒకే ఒక భారతమాత సంతానమనే విషయము మనస్సుకు వస్తుంది. ఆ ముసలివాడెవరో కాదు; మన శాఖలో ఉండే భగవాధ్వజమే. ఆ భగవాధ్వజమే వేలాది సంవత్సరాల నుండి మన దేశంలో ఎగురుతున్నది. దీని వైపు మనస్సు నిలిపి చూస్తే, మన ఈ ధ్వజమే చంద్రగుప్తుని కాలములో, అనేక యుద్ధ సమయాల్లో ఉండినదనీ, విక్రమాదిత్యుని కాలంలోను, రాముని కాలంలోను, శివాజీ కాలంలోను ఉన్న ధ్వజ మిదేననీ మనకు జ్ఞాపకము వస్తుంది. మనమంతా సోదరులమనీ, భారతదేశము మనదనీ ఈ ధ్వజము గుర్తు చేస్తుంది. ఈ ధ్వజము వైపు దృష్టి నిలిపి చూడడంతోనే పరస్పర అంతః కలహాలు మరిచిపోతాము. అందుచేత ఈ ధ్వజాన్ని మన గురువని పిలుస్తాము. ఇది మనకు దారి చూపిస్తుంది. ఒకరినొకరం ప్రేమించుకోడం ఇది నేర్పుతుంది. ఆ ముసలివాని కారణంగా, పోట్లాడుకుంటున్న సోదరులు ఒకరినొకరు ప్రేమించుకోసాగినట్లు, మనము కూడ శాఖకు వెళ్ళి ఈ ధ్వజాన్ని చూస్తే, ఈ ధ్వజము ఇచ్చే సందేశాన్ని ఏకాగ్రతతో వింటే మనమంతా సోదరులమని సమగ్ర హిందు సమాజము తెలుసుకుంటుంది. ఏకాగ్రత లేకుంటే, మామూలు చెవులకు ఈ ధ్వజ మిచ్చే సందేశము వినపడదు. గుర్తింపు కలిగించి మనము వారిని సంఘటిత పరచాలి.

# ప్రశ్నోత్తరాలు

1. పంజాబు సమస్య పూర్తికాకముందే గూర్ఖాలాండ్ సమస్య ఉత్పన్నమైంది. గూర్ఖాలాండ్ సమస్య ఉంటూ ఉండగానే త్రిపుర సమస్య, ఉగ్రవాదుల విజృంభణ ఏర్పడినవి. ఈ విధంగా జాతీయ సమస్యలు పుట్టుకవస్తూ ఉంటే భారతదేశ భవిష్యత్తు ఎలా ఉంటుంది ?

సమాధానము :- గూర్ఖాలాండు సమస్యను మనము న్యాయమైన సమస్యగా పరిగణించడంలేదు. గూర్ఖాలాండ్ పేరట ప్రత్యేక రాజ్యం ఏర్పడాలని వాళ్ళకోరిక. అది చాలా చిన్న ప్రదేశము. భాష ఒక్కటే వేరే రాజ్యం ఏర్పాటు చేయటానికి గీటురాయి లేదా షరతు కారాదు. డార్జి లింగ్ ఒక జిల్లా.ఆ జిల్లాలో కొండ ప్రాంతమేకాక కొంత మైదాన ప్రదేశం కూడా ఉంది. ఆ రెంటింటి జనాభా 6, 7 లక్షలు కావచ్చు. అందులో గూర్ఖా భాష మాట్లాడేవారు 2 లక్షలు. ఈ అల్ప జనాభా కోసం ప్రత్యేక రాజ్య నిర్మాణం ఏ మాత్రమూ ఉచితమైన విషయం కాదు. డార్జిలింగ్‌కు పైభాగంలో సిక్కిం అనే ఒక చిన్న ప్రాంతం ఉంది. దాని జనాభా మూడు లక్షలు. అది తర్వాత భారతదేశంలో కలిసింది. భాషను దృష్టిలో ఉంచుకొని గూర్ఖాలాండ్ కోరేవారికి రెండు మార్గాలు సూచించడం జరిగింది. నేపాలీ భాష మాట్లాడే ఈ రెండున్నర లక్షల జనాభాగల ప్రదేశాన్ని సిక్కింతో కలిపివేయడం లేదా కొంత స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రత్యేక జిల్లాగా (antonomous) మార్చడం.

కాని వారు ఈ రెండు పద్ధతులలో దేనికీ సుముఖంగా లేరు. మొదట్లో గూర్ఖాలాండ్ విషయంలో వారు చాలా పెద్ద పెద్ద మాటలు మాట్లాడారు,

కాని ఇప్పుడు కేంద్రాన్ని వారు అడుగుచున్నదేమిటంటే- భారతదేశంలో చాల కాలంగా నివసిస్తూ వస్తున్న నేపాలీలకు భారత పౌరసత్వము లభింప జేయాలి అని. భారత పౌరులు చాలమంది నేపాల్‌లో నివసిస్తున్నారు. అలాగే నేపాల్ పౌరులు చాలమంది భారత్‌లో నివసిస్తున్నారు. ప్రస్తుతం అమలులో ఉన్న ఒప్పందం ప్రకారము వాళ్ళు ఆయా దేశాలలో తమ వృత్తి ఉద్యోగాలు, పనిపాటలు అన్నీ చేసుకోవచ్చు. అయితే నేపాలీ వ్యక్తికి భారత పౌరసత్వంగాని, భారతదేశ వ్యక్తికి నేపాల్ పౌరసత్వం గాని లేదు. అందుచేత ఈ విషయంలో వాళ్ళు సమస్యను లేవదీశారు. వేరే స్వతంత్ర రాజ్యమనే కోరిక అణిగిపోయింది. అది అసలు హేతువాదానికి నిలచేదికాదు. దానివల్ల దేశ విభజనకు బాట ఏర్పడుతుంది. అందుచేత దానిని మనము సమర్థించాము.

ఇక ఈ దేశ పౌరసత్వ సమస్య విషయంలో కేంద్ర ప్రభుత్వం ఆలోచించాలి. దీనికి మనకు ఎటువంటి అభ్యంతరము లేదు.

2. మనం ప్రతిదినం పేపర్లో చూస్తున్న విషయం - రామజన్మ భూమి-బాబరీ మసీదు సమస్య. రామ జన్మభూమి విషయంలో చరిత్ర సాక్ష్యమిస్తున్నది. ఈ విషయంలో సంఘ ఆలోచనా సరళిని దయయుంచి వివరించగోరుతున్నాను.

సమాధానము :- రామజన్మభూమి మనది. హిందూ సమాజానికి గౌరవ చిహ్నం. అత్యంత ప్రాముఖ్యం గల స్థానమది. దానిని హిందువులు తిరిగిపొందాలి. అక్కడ ఒక అత్యంత భవ్యమైన మందిరం నిర్మింప బడాలి. ఈ కార్యక్రమాన్ని విశ్వ హిందూ పరిషత్ చేపట్టింది. మనతో కూడ చర్చించిన మీదట విశ్వ హిందూపరిషత్ ఈ కార్యాన్ని తీసుకొంది. అందుచేత ఈ విషయంలో రెండవ ఆలోచనకు ఆస్కారం లేదు. ఎవరో

ఒక విదేశీయుడు వచ్చి రామజన్మ భూమిని ధ్వంసంచేసి అక్కడ మశీదు కట్టించే ప్రయత్నం చేశాడు. అది పూర్తికాలేదు కూడా. రామజన్మభూమి బాబరీ మశీదు-ఈ రెండు విషయాలను సమస్థాయిలో ఉంచి చూడటం ఏనాటికీ జరుగదు. దేశంలోని ఇతర ప్రదేశాల్లో కట్టిన మశీదు లన్నిటినీ పడగొట్టి అక్కడ దేవాలయాలు నిర్మించాలని మనం కోరడంలేదు. అయితే ఇది పవిత్ర దేవాలయ శిథిలాలమీద కట్టిన మశీదు. ఆ పవిత్రస్థానాన్ని తిరిగి పొందడమనే విషయము ఇది. శివాజీ మహారాజు తన రాజ్యంలో మశీదులను పడగొట్టలేదు. తుల్జాపూర్ భవానీ, పండరిపూర్ అనే పవిత్ర స్థానాలను అఫజుల్ ఖాన్ అపవిత్రము చేసినాడు. ఆ తర్వాత కాలంలో శివాజీ మహారాజు ఆ స్థానాలలో నిర్మింపబడిన మశీదులను పగులగొట్టి, తొలగించి మరల అపూర్వమైన దేవాలయాలను నిర్మింపజేశాడు. మన దృష్టిగూడా అదే. ఎక్కడెక్కడి హిందువుల తీర్థస్థలాల స్థానంలో మశీదుల నిర్మాణం జరిగిందో అక్కడ వానిని తొలగించి తిరిగి మందిరములను నిర్మించాలి. రామ జన్మభూమి, కృష్ణ జన్మభూమి, కాశీ విశ్వనాథ్-హిందువులకు చెందిన ఈ మూడు పవిత్ర స్థానాలు మనము తిరిగి పొందాలి. ఇందులో అస్పష్టత ఏమీ లేదు. ఇవి ముసల్మానుల పవిత్ర స్థానాలేమీ కావు. కేవలం జబర్దస్తీగా హిందువుల దేవాలయాలను పడగొట్టి కట్టుకొన్న మసీదులు మాత్రమే, కాబట్టి అవి తిరిగి హిందువులకు చేరాలి.

3. పంజాబులో జరుగుతున్న అల్లర్ల కారణంగా హిందువులకు శిఖ్ఖులకు మధ్య ఏర్పడిన అగాధాన్ని దూరం చేయడానికి సంఘం ఏ విధంగా కృషి చేస్తున్నది? ఈ సమస్య ఇదే విధంగా ఉండిపోతుందా?

సమాధానము :- కృషి జరుగుతున్నది. ఒక మంచి పనికోసం ఎంతో ప్రయత్నం చేయవలసి ఉంటుంది. ఈ సమస్యలు తొలగించగలమా, లేమా, అని మన మేనాడు చెప్పలేము, అయితే, ఈ సమస్యకు పరిష్కారం

ఎట్లా? మొదటిది పంజాబు నుండి హిందువులు పారిపోయి రాకూడదు. ఈనాడు అక్కడ కేశధారి హిందువుల అనగా శిఖ్ఖుల జనాభా 53%. కేశధారి కాని మిగిలిన హిందువుల జనాభా 47%. తేడా చాలా స్వల్పము. ఒక వైపు ఉగ్రవాదులు హిందువు లక్కడి నుండి పారిపోవాలని పథకాలు వేస్తున్నారు. అక్కడి హిందువులు భయభ్రాంతులై దేశంలోని ఇతర ప్రదేశాలకు వెళ్ళిపోతే ఆయా ప్రదేశాలలో శిఖ్ఖులకు వ్యతిరేకంగా క్రోధం పెరుగుతుంది. ప్రజలు శిఖ్ఖుల మీద దాడులు జరుపుతారు. శిఖ్ఖులు అక్కణ్ణుండి పారిపోయి పంజాబు చేరుకొంటారు. ఇలాగ క్రమక్రమంగా జనాభా మార్పిడి (Exchange of Population) జరుగుతుంది. శిఖ్ఖుల జనాభా పంజాబులో పెరుగుతూపోతుంది. కేశధారి కాని హిందువుల జనాభా తరుగుతూ పోతుంది ఇది వారి పథకం.

అందుచేత హిందువులు పంజాబు నుండి పారిపోయి రాకూడదని మనము అంటాం. వారు దృఢంగా, ధైర్యంగా, స్థిరంగా నిలవాలి. చిన్న చిన్న పల్లెలలో హిందువుల సంఖ్య తక్కువగా ఉన్నచోట వాళ్ళను భయ పెట్టడం జరుగుతున్నది. అక్కడి నుండి వాళ్ళు వదలివచ్చి ఒక పెద్ద పట్టణంలోనో, నగరంలోనో ఉండిపోయి తమ పనిపాటలు చేసుకోవాలి. అంతేకాని పంజాబును వదలిపోరాదు. ఇది మొదటి విషయం.

ఇక రెండవది శిఖ్ఖులను కలిసిమాట్లాడాలి. ఎక్కువగా కలవాలి. వాళ్ళతో "చూడండి. పాకిస్తాన్ ఏర్పడడంతో ముస్లిముల సమస్య పరిష్కారం కాలేదు. ఈనాడు కూడ ఆ సమస్య ఉన్నది. పాకిస్తాన్‌తో యుద్ధాలు జరుగుతున్నాయి. దేశమంతటా ముస్లింములు ఆందోళనలు కూడా చేస్తూ ఉన్నారు. అందుచేత ఖలిస్తాన్ ఏర్పడడంవలన ఈ సమస్య పరిష్కారం ఏమాత్రం కాదు. దేశమంతా మీదే, ప్రేమతో కలిసి జీవించండి"

అని చెప్పాలి. ఈ పని చేస్తే అందరూ కాకపోయినా హెచ్చుసంఖ్యలో ఈ ఆలోచనను సమర్థించే వారు తయారౌతారు. శిఖ్కులలో అర్థంచేసుకొనే వ్యక్తులను వెదకి పట్టుకొని వారి స్వరము వినిపించేటట్లు చేయాలి. కొంచెం మాట్లాడవలసిందని చెప్పాలి. లేకుంటే వాళ్ళుకూడా మాట్లాడరు. నిమ్మ ళంగా ఊరకుంటారు. సామాన్యంగా మంచివాళ్ళు మాట్లాడకుండా శాంతంగా ఉంటుంటారు. అందుకని మాట్లాడేటట్లు చేయడానికి పూనుకోండి. ఇది మన రెండవ కృషి.

ఇక మూడవది - పక్షపాతంతో కూడుకొన్న పంజాబు ప్రభుత్వం పైన ఒత్తిడి తేవడం. శిఖ్కులకు సంబంధించిన విషయాలలో అక్కడి ప్రభుత్వం వెంటనే నిర్ణయాలు తీసుకొంటుంది. తగిన చర్య తీసుకొని వాళ్ళకు సహాయం చేస్తుంది. మిగిలిన హిందువుల ప్రశ్న వచ్చినపుడు నిర్ణయాలు తీసుకోదు. కేసు రిజిస్టరు చేసుకోదు. ఇటువంటివి జరగకుండా ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలి. ఆ ప్రకారము నడుచుకోకపోతే కేంద్ర ప్రభుత్వం అధికారంక్రిందికి పంజాబు వస్తుంది. కేంద్రఉద్యోగులు-పోలీసు ఆఫీసర్లు-IAS ఆఫీసర్లు కొంత కఠోరమైన నిర్ణయాలు తీసుకోగలుగుతారు.

ఈ మూడు విధాలుగా మన ప్రయత్నాలు జరుగుతున్నాయి. దీనితో పాటు దేశమంతటిలో ఉండే శిఖ్కులను సంఘటిత పరచాలని మనమను కొంటున్నాము. వాళ్ళ ద్వారా కూడా ఒత్తిడి తేవాలి. 80 లక్షల మంది శిఖ్కులు పంజాబులోను, 40 లక్షల మంది పంజాబు వెలుపల నివసిస్తు న్నారు. ప్రతిచోట "రాష్ట్రీయ శిఖ్క సంగత్" ఏర్పాటు చేసి, "ఈ ఖలిస్తాన్ ఏర్పరచడము, వేరు పడటము మంచిది కాదు" అని వారిచేత గూడా ఉద్ఘోషింప జేయాలి.

4. ఆదర్శమూర్తి, సుగుణవంతుడు అయిన రాజులాగ సమాజాన్ని ఉద్ధరించడానికి రాజకీయాలలో ఎలక్షన్లలో మనం ఎందుకు ప్రత్యక్షంగా పాల్గొన కూడదు?

సమాధానము :- ఈ విధమైన ఆలోచన అనేకులు చేస్తుంటారు. కాని వేరువేరు గుణాలను నిర్మాణం చేసే క్షేత్రాలు వేర్వేరుగా ఉంటాయి. ఒకటి సేవాక్షేత్రం, మరొకటి ప్రభుత్వక్షేత్రం. రాజకీయాల్లో పనిచేసే వాళ్ళు ప్రత్యక్ష ఎన్నికలలో నిలబడతారు. ఈ రెండు రంగాల ఆలోచనలలో, కొంత తేడా ఉన్నది. రాజకీయాల్లో పనిచేసే వ్యక్తికి ఎల్లప్పుడూ ఓటు మీదనే చూపు ఉంటుంది. న్యాయమైనమాట చెప్పడానికి జంకుతారు. దీనివలన తన ఓట్లు తగ్గుతాయేమోనని అనిపిస్తుంది. అయితే న్యాయమైన మాట చెప్పేది, సమాజాన్ని రాష్ట్రీయ గుణాలతో నింపేది, మంచి ప్రభుత్వాన్ని నిలిపేది అయిన ఏదోఒక సంఘటన అవసరము. ప్రాచీనకాలంలో మన ఉపాధ్యాయులు, ధార్మికపురుషులు ప్రత్యక్షంగా ఎన్నికలలో పాల్గొనే వారుకారు. వాళ్ళు విద్యావ్యాప్తి చేసేవాళ్ళు. దేవాలయాలు, మఠాలునడిపే ప్రముఖులు ప్రత్యక్షంగా ఎన్నికలలోపాల్గొనేవారుకాదు. కాని వాటిని ప్రభావితం చేసేవారు. ప్రజలద్వారా గాని, ఆనాడు ఉంటూ ఉండిన రాజుల ద్వారాగాని ప్రభావితం చేసేవారు. ఇప్పుడు ప్రత్యక్ష రాజకీయాలలో దిగడం మూలంగా దేశంలో చాలమందికి మేలుకలగవచ్చు. కాని అక్కడికి వెళ్ళడంతోనే ముసల్మానుల విషయంలో స్పష్టంగా చెప్పవలసిన మాటలు చెప్పలేకపోతారు. ఇలా రాజకీయ పార్టీలకు ముసల్మానులఓట్లుకూడా మనకు రావచ్చు కాబట్టి వాళ్ళకు కోపం తెప్పించడం మంచిదికాదు. ఈ విషయాన్ని ఇంత నిష్కర్షగా చెప్పడం తగదు అనిపిస్తుంది. దేశానికి మేలు చేకూర్చే విషయాన్ని స్పష్టంగా, మొగమాటంలేకుండా నొక్కిచెప్పాలని, ప్రజలకు మంచి ప్రభుత్వాన్ని అందించాలని సంఘం అనుకుంటే అది

రాజకీయాలకు దూరంగా ఉండవలసి ఉంటుంది. జనతాపార్టీ ఏర్పడి నప్పుడు చంద్రశేఖర్‌జీ "మీ R.S.S. వారుగూడా జనతాపార్టీలో చేరిపొండి, కలిసిపొండి" అన్నప్పుడు మన సరసంఘచాలక్‌జీ ఇలాఅన్నారు: "సమాజ సేవ చేయడానికి అనేక మార్గాలున్నాయి. అంతేకాని అందరూ ఒకేవిధంగా పనిచెయ్యాలనడం సబబుకాదు. ఒకరికి ధార్మికక్షేత్రంలో, మరొకరికి రాజ కీయంలో వేరొకరికి విద్యాక్షేత్రంలో ఇంకొకరికి సేవాకేంద్రంలో ఆసక్తి ఉండవచ్చు." వారొక ఉదాహరణ ఇచ్చారు. ఢిల్లీలోని రైలుబండ్లన్నీ ఒకటవ ప్లాటుఫారం నుండే బయలుదేరాలి అంటే అది సాధ్యం కాదు. ఢిల్లీలో చాలా ప్లాటుఫారాలున్నాయి. ఇన్ని ప్లాటుఫారాలు ఎందుకేర్పడ్డాయి అంటే ఒకే ప్లాటుఫారం నుండి అన్ని బండ్లు వెళ్ళలేవు కాబట్టి. అక్కడి నుండి వెళ్ళే దిశ ఒక్కటే అవుతుంది కనుక. మరి దక్షిణ ఎక్స్‌ప్రెస్ ఆంధ్రప్రదేశ్, తమిళనాడు ఎక్స్‌ప్రెస్........ఇవన్నీ ఒకే ప్లాటుఫారం నుంచి వెళ్ళాలంటే జరిగే పని కాదు. మేము కొన్ని సద్గుణాలను నిర్మాణం చేయాలనుకుంటున్నాం. నిజమైన మాటను, నిక్కచ్చిగా చెప్పా లనుకొంటున్నాం. అందుకని ప్రత్యక్ష రాజకీయాలలో పాల్గొనము. అయితే ఓట్లు వేస్తాము. రాజకీయాలను ప్రభావితం చేయడానికి కృషి చేస్తాము. సరైన దారిలో రాజకీయాలు నడిచేటట్లు చేయటానికి అవశ్యము మేము కృషి చేస్తాము. ఏమీ అంటకుండా ఉంటామని మా ఉద్దేశ్యంకాదు" అని అన్నారు.

"కోఈ నృప్ హో హమేం కా హాని" పూర్వ కాలంలో ఇలాంటి లోకోక్తి ఒకటి ఉంది. రాజు ఎవరైనాగానీ- బయటివాడుగాని లేక మన వాడే గాని మాకు తేడా ఏముంది? మన ఆలోచన ఇటువంటిది కాదు. రాజకీయాలు కూడా చక్కగా నడవాలి. మంచి వాళ్ళ చేతుల్లో ఉండాలి. అని మనము కోరుతాము. ప్రత్యక్ష రాజకీయాల్లో పాల్గొన్నందున మన మీ కార్యాన్ని సక్రమంగా చేయజాలము కనుక అందులో పాల్గొనము.

ప్ర. 5. ఈ మధ్య బంగ్లాదేశ్ నుండి చాలామంది చక్మా సోదరులు శరణార్థులుగా మన దేశానికి వచ్చారు. వాళ్ళకు తిండి పంపించడానికి ప్రయత్నిస్తే అక్కడ వాళ్ళకు రక్షణ లేనందున వెళ్ళడానికి నిరాకరిస్తు న్నారు. ఈ విధంగా అనేక పర్యాయాలు శరణార్థులుగా ఎంతో మంది ఈ దేశానికి వచ్చారు. వాళ్లను సోదరులుగా భావించి మనం ఆశ్రయం ఇస్తూ వచ్చాము. ఇదే విధంగా చేస్తూపోతే మనం చాలా కష్టాలు ఎదుర్కో వల్సి వస్తుంది. వాళ్ళ భూ భాగాన్ని వాళ్ళకిప్పించేట్లు ప్రయత్నం చేస్తే దానితో వాళ్ళు తమ కాళ్ళ మీద తాము నిలబడగలుగుతారు. మన మీద భారముండదు. అప్పుడు సమస్య తొలగిపోతుంది. వాళ్ళ భూ భాగం మన సరిహద్దులను ఆనుకొని ఉన్నది. దాన్ని తిరిగి ఇప్పించే ప్రయత్నము మన ప్రభుత్వము చేస్తే ఎలా ఉంటుంది? ఈ విషయంలో తమ ఉద్దేశ్య మేమిటి? ఈ మధ్య SAARC సమ్మేళనంలో కూడా సహ అస్తిత్వం కోసం పని చేస్తామని నిర్ణయం తీసుకోబడింది.

సమాధానము :- ఇప్పుడప్పుడే వాళ్ళు తిరిగివెళ్ళే ప్రశ్నలేదు. ఆస్తి వాళ్ళకిప్పించడమంటే వాళ్ళ భూభాగములో వాళ్ళ నుండనీయడము. ఈ విషయమై SAARC లో చర్చలు జరిగాయి. ఇతరత్రా కూడ రాజ నీతి దృష్ట్యా చర్చలు జరుగుతూ ఉన్నాయి. వాళ్ళను తిరిగి తీసుకోడానికి తాము సిద్ధమేనని బంగ్లాదేశ్ అంటున్నది. అయితే అక్కడవాళ్ళకు రక్షణ కనబడటంలేదు కనుక తిరిగి వెళ్ళటానికి వాళ్ళు సిద్ధంగా లేరు. ఈ చర్చ లలో సూచించబడినట్లుగా వాళ్ళ ప్రతినిధులు కొందరు, భారత ప్రభుత్వ ప్రతినిధులు ఒకరిద్దరు, బంగ్లాదేశ ప్రతినిధులు కలిసి అక్కడకు వెళ్ళి. అక్కడ వాళ్ళు ఉండగలుగుతారా, లేదా, అక్కడి పరిస్థితులెలాగున్నాయి. అని చూడాలి. మానవ హక్కుల సంఘాలు (Human rights Commission), Amnesty International వంటి అంతర్జాతీయ

సంస్థలు) అక్కడకు వెళ్ళి చూడాలి. ఆ తర్వాత శరణార్థులను తిరిగి వెళ్ళమని చెప్పాలి. అయితే ఈనాటివరకు బంగ్లాదేశ్ ప్రభుత్వము ఇందుకు సిద్ధంగాలేదు. మూడుసార్లు ఒప్పందము జరిగింది. తిరిగి వెళ్ళాలి. తిరిగి పంపాలి. మేము తీసుకుంటాము. ఈ ప్రకారంగా మాట్లాడడము జరిగింది. కాని, వాళ్ళు వెళ్ళడంలేదు. వాళ్ళ స్థితి చాల అధ్వాన్నంగా ఉంది. దేశ మంతటి నుండి సేకరించి మనము వారికి కొన్ని చలికాలపు దుస్తులు మందులు పంపాము. అవి విశ్వహిందు పరిషత్ ద్వారా పంపకము జరగా లని మేము కోరినందున ప్రభుత్వము తీవ్రమైన విరోధము ప్రకటించింది. నృపేన్ చక్రవర్తి దీనిని అనుమతించలేము. మేము అక్కడి త్రిపుర ఉప జాతి సమితి ద్వారా సహాయము అందజేసాము. ఈ వస్తువులను విశ్వ హిందు పరిషత్ సేకరించినట్లు ప్రకటించగలమని వారు చెప్పారు. ఆ వస్తువులు శరణార్థులకు అందాయి. అయితే అక్కడి పరిస్థితి చాల క్లిష్టంగా ఉన్నది. ఎంతో మంది చనిపోతున్నారు. ఆహారపు కొరత మొదలైన సమస్యలున్నాయి. బంగ్లాదేశ్‌లో నేరుగా మనమేమీ కృషి చేయలేము. మన దేశ ప్రభుత్వంతో, విదేశశాఖతో, అక్కడ సురక్షా వ్యవస్థ చక్కబడినంత వరకు వాళ్ళను తిరిగి పంపరాదు అని చెప్పడం మన పని ఇంతమాత్రమే మనం చేయగలము, చేస్తున్నాము.

ప్రశ్న 6. భారత రాజ్యాంగంలోని 370 వ ఆర్టికల్ ద్వారా కాశ్మీర్‌కు కొన్ని ప్రత్యేక అధికారాలు ఇవ్వబడ్డాయి. ఆ ఆర్టికల్ ఉన్నందున వేర్పాటు ధోరణులు తలఎత్తుతున్నాయి. దానివల్లనే నాగా లాండ్, మిజోరమ్ సమస్యలు కూడ ఉవ్వెత్తుగా లేచినిలచాయి. రాజ్యాంగం నుండి ఆ ఆర్టికల్‌ను తొలగింపజేయడానికి మన భారతీయుల కర్తవ్య మేమిటి ? ఈ విషయంలో సంఘ ఆలోచనా సరళి ఏమిటి ?

సమాధానము : మొదటి విషయం. ఇవి ఉండరాదు. ఈ విషయం B.J.P. కూడ చెపుతున్నది సంఘమూ చెపుతున్నది దాన్ని గూర్చి అప్పుడప్పుడు తీర్మానాలు ఆమోదించడం గూడ జరుగుతున్నది. విద్యార్థి పరిషత్ అలాంటి తీర్మానం చేసింది. ప్రస్తుతము ఒకవైపు ప్రచారం చేయడం, మరొకవైపు రాజకీయ పార్టీలమీద ఒత్తిడి తీసుకరావడం, ఇంత మాత్రమే చేయడానికి వీలున్నది. కాబట్టి 370 ఆర్టికల్, మిజోరమ్‌లో అమలులో ఉన్న 371 ఆర్టికల్‌ల విషయంలో మాట్లాడడం, ఆ విషయమై ప్రజలను జాగృతపరచడం అనేక ప్రముఖ కార్యాన్ని మనము చేపట్టాము. వేర్పాటు వాదులను ఎలా నిరోధించవచ్చునో ఆ విషయం కూడ కొలత తీసుకున్నాము. ప్రత్యేక ప్రతిపత్తి ఎవరికి కూడ ఇవ్వరాదు. దేశంలో అందరూ ఒకలాంటివారే ఏ ప్రాంతానికి ప్రత్యేక ప్రతిపత్తి అంటూ ఉండరాదు.

7. కేంద్ర ప్రభుత్వ కంపెనీలు ప్రకటించే అప్లికేషన్ ఫారాలలో నీవు R.S.S. సభ్యుడవా? అని ఒక ప్రశ్న ఉంటున్నది. అనేకసార్లు స్వయం సేవకులు No. అని వ్రాయవలసి వస్తున్నది దానిని తొలగించే ప్రయత్నాలు మనవైపునుండి ఏమైనా జరిగాయా?

సమాధానము ; వాస్తవానికి సర్వీసులో చేరిన తర్వాత వారికి కొన్ని రూల్సు ఉంటూ ఉంటాయి. ఆ రూల్సు ప్రకారము ఫలానా పని చేయ రాదు అని వాళ్ళనవచ్చు. కాని, సర్వీస్‌లోకి తీసుకోకముందే ఈ విధంగా ఎటువంటిదైనా సరే నిబంధనలు విధించడం గాని, అడగడం కాని తగదు. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఒకానొక స్వయం సేవకుని కేసులో సుప్రీంకోర్టు "మీరు ఏ పార్టీకి చెందినవారు? ఏ ప్రదేశానికి చెందినవారు? అని ఎవరి నైనా ప్రశ్నించడం ప్రజాస్వామ్య దేశంలో తప్పు" అని తీర్మానం

చేసింది. ఆయన O.N.G.C. లో ఉద్యోగి. మీరు ఎప్పుడైనా జైలు కెళ్ళారా అని ఆయనను ప్రశ్నించడం జరిగింది. దానికి ఆయన Emergency కాలంలో సత్యాగ్రహం చేసి జైలు కెళ్ళానని సమాధానము వ్రాసాడు. దాని ఆధారంగా ఆయనను ఉద్యోగం నుండి తొలగించారు. అప్పుడాయన హైకోర్టుకు, తర్వాత సుప్రీం కోర్టుకు అపీల్ చేశాడు. సుప్రీం కోర్టు చాల చక్కని తీర్పు యిచ్చింది. "ప్రతి వ్యక్తి తన పార్టీకే, కాంగ్రెసు పార్టీకే చెంది ఉండాలని ప్రభుత్వము కోరుతున్నదా? మనది ప్రజాస్వామ్యము. ఇక్కడ వ్యక్తులు అన్ని రకాలైన పార్టీలలో పని చేస్తుంటారు. అందరికీ సెలెక్షన్ విషయంలో సమానమైన అవకాశాలుండాలి. ఒక వ్యక్తి ప్రభుత్వంలో చేరిన తర్వాత, అతనిమీద కొన్ని నిబంధనలు ప్రభుత్వము ఉంచవచ్చు. అయితే, నీవు R.S.S. సభ్యుడవు గనుక నిన్ను తీసివేస్తామనడం కుదరదు. కాని, ప్రభుత్వ నిబంధనలలో "ప్రభుత్వ అనుమతిలేకుండా జమాతే ఇస్లామీ, R. S. S. లాంటి సాంప్రదాయక సంస్థలలో చేరరాదు" అని వ్రాసి ఉంటుంది. జనతా పార్టీ ప్రభుత్వమున్న రోజులలో కొంత ప్రయత్నము జరిగింది. ఆ వాక్యాన్ని తొలగించవలసిందని మేము చౌధురీ చరణ్‌సింగ్‌ను కలుసుకొని అడిగాము. ఆయన ఈ విధంగా అన్నారు: నిబంధనలను తొలగించే లేదా ఆమోదించే విధానము ప్రభుత్వంలో సుదీర్ఘంగా ఉంటుంది. కేవలము మంత్రిగారి ఆజ్ఞల వల్ల హఠాత్తుగా ఒక్కసారి జరగదు. క్రింద ఉన్న చిన్న ఆఫీసర్ దీని అవసరము ఏమీ లేదని ముందుగా వ్రాస్తాడు. తర్వాత అది క్రింద నుండి పైకి మెల్ల మెల్లగా సెక్రటరీ స్థాయి వరకు వచ్చేటప్పటికి ఒకటి రెండు సంవత్సరాలు పడుతుంది. అప్పటికి ప్రభుత్వమే మారిపోయి వుండవచ్చు. మళ్ళీ అవే సమస్యలు అని అంటూ ఆయన ఇలా అన్నారు: కాంగ్రెసు ప్రభుత్వము తొలగించిన వందలాది మీ పార్టీకి చెందిన ఆఫీసర్లు జనతా పార్టీ ప్రభుత్వంలోకి వచ్చిన తర్వాత మరలా ఉద్యోగంలోకి

తీసుకోబడ్డారు. R. S. S. కు చెందిన ఉన్నప్పటికీ మరల ఉద్యోగంలో చేరగలడు అనేదానికి ఇది నిదర్శనము. కాబట్టి మీ వాళ్ళతో పనిచేస్తూ వెళ్ళమని చెప్పండి. చట్టాలు చేయాలి అనే చక్రవ్యూహంలో చిక్కుకోకండి. ఇది సుదీర్ఘం - కఠినం - ఈ రోజుల్లో ప్రభుత్వోద్యోగులు హెచ్చుగా ఆందోళనలలో పాల్గొంటున్నారు. నినాదాలు చేస్తున్నారు. N. G. O. ఆఫీసర్‌లు జైళ్ళకు కూడ వెళ్తున్నారు. R.S.S. మంచి పని చేస్తున్నప్పుడు అందులో పాల్గొనడానికి వెనుకాడడం ఎందుకు? ధైర్యంతో ముందుకు రావాలి. ఒక విషయం గుర్తుంచుకోండి. అక్కడ నుండి ఆర్డరువస్తే అటు తర్వాత ఇంకా ఎక్కువమంది సంఘానికి చేరువౌతారు అనుకోవద్దు. ఆర్డర్ పాస్ అయినా ఇంకొక ప్రభుత్వము వస్తే, అది మన మీద చర్యతీసు కుంటుందేమో, ఎవరికి తెలుసు, అని పిరికివాళ్ళు అనుకుంటారు. భయపడే వాళ్ళకు ఎక్కడ కూడ స్థిమితము దొరకదు. అందుచేత ఈ విషయంలో మనము హెచ్చుగా ఆందోళన చెందనక్కరలేదు. మీరు చెప్పినట్లుగా ఒక సారి ప్రయత్నం చేశాము.

R.S.S. లో వేలకొలది స్వయం సేవకులు పనిచేస్తున్నారు. వాళ్ళ విషయమేమిటి అనేది ప్రశ్న. నీవు R. S. S. లో సభ్యుడవాలంటే (Member) సంఘంలో సభ్యత్వమనే మాటే లేదు. ఇక్కడున్నది స్వయం సేవక్ సభ్యత్వానికి ఒక దరఖాస్తు ఫారము ఉంటుంది. కొంత సభ్యత్వ చందా ఉంటుంది; ఏదో ఒక రకమైన చిహ్నం కూడ సభ్యుల కిస్తారు. సంఘంలో ఇటువంటి వేవీ లేవు. మీరు ఏ ఫీజూ ఇవ్వలేదు. ఏ ఫారమూ నింపలేదు. కాబట్టి నమ్మకంగా నేను R. S. S. సభ్యుడను కాదు అని మీరు వ్రాయవచ్చు

8. మత పరివర్తన సమస్య హిందూసమాజంలో పుట్టగొడుగులుగా వ్యాపిస్తూ ఉన్నది ఈ సమస్యా పరిష్కారానికి సంఘం తీసుకున్న చర్య లేమిటి ?

సమాధానము :- ఇది క్లిష్టసమస్య అనడంలో సందేహం లేదు. వాళ్ళు నేర్పుగా చాలా చాలా చేస్తుంటారు. కాని పైకి కనపడరు. దాదాపు వేయి సంవత్సరాలుగా ముస్లిమును మనమెరుగుదుము. మనతో ఈ వేయి సంవత్సరాలనుండి అతడు పోరాడుతూ వస్తున్నాడు. అతడు చేసే పనులు మనకు తెలుసు. అందుచేత అతన్ని బాగా గుర్తింపగలము. క్రైస్తవుని అలాగ గుర్తింపలేము. ఈ సమస్యను మూడు, నాల్గు రంగాలలో మనము ఎదుర్కోవలసి వుంటుంది.

మొదటిది ప్రచారము. క్రైస్తవ మతంలో విశేషమేమీ లేదు. అందు కని ఈనాడు పాశ్చాత్యదేశాలు క్రైస్తవ ధర్మాన్ని వదలిపెట్టేస్తున్నాయి. చర్చీలు ఖాళీగా మిగిలిపోతున్నాయి. ఇది శాస్త్రీయమైన మతంకాదు, అని రచనలు చేయడానికి పూనుకొని కొంతమంది ముందుకు రావాలి. ఇక రెండవది. విదేశీ మిషనరీలు భారతదేశానికి రావడానికి అనుమతి ఇవ్వకుండా ప్రభుత్వం మీద ప్రజలు ఒత్తిడి తేవాలి. మనకు ఏ విదేశీ మిషనరీ అక్కర్లేదు. వాళ్ళు వెళ్ళిపోవాలి. విదేశాలనుండి ధనము ఇక్కడి మిషనరీ లకు నేరుగా అందరాదు. ఏదో ఒక పనికోసం విదేశాలనుండి డబ్బు వచ్చే పక్షంలో, అది ప్రభుత్వం దగ్గరకే రావాలి. ప్రభుత్వమే దానిని తగిన చోట తగినవిధంగా ఖర్చుపెట్టాలి. ఈ మిషనరీలందరి జమాఖర్చు లెక్కలు తనిఖీ చేయబడాలి. విదేశీ ద్రవ్యాన్ని ఉచితరీతిలో ఖర్చుపెట్టేటట్లు నియంత్రణచేసే ఒక ప్రభుత్వశాఖ ఉండాలి. విదేశీ మిషనరీలు మన

దేశంలో లేకపోతే, దానికి తోడు విదేశీ ద్రవ్యము ఇక్కడికి రాకపోతే, మిషనరీల ప్రభావము చాలమట్టుకు తగ్గిపోతుంది. ఇక మూడవ విషయము. ఏ వెనుకబడిన ప్రదేశాలలో మిషనరీలు మత పరివర్తన చేస్తున్నారో, ఆ ప్రదేశాలకు వెళ్ళి మనముకూడ పనిచేయాలి. మేము పట్టణాలలో విశ్రాంతిగా కూర్చుంటాము, అక్కడికి వెళ్ళము అని అనుకుంటుంటే మిషనరీలు అక్కడికి వెళ్ళి సేవలు చేయడం, స్కూళ్ళు, ఆస్పత్రులు నడపడం, రకరకాల శిక్షణ (Training) ఇవ్వడం చూస్తుంటే, సహజం గానే అక్కడివారు వాళ్ళ మాటలు వింటారు. అందుచేత మనము కూడ అక్కడికి వెళ్ళి పనిచేయాలి. వనవాసీ కల్యాణ్ ఆశ్రమ్ ద్వారా మనము వనవాసీ క్షేత్రంలో పనిచేస్తున్నాము. ప్రస్తుతం వనవాసీ క్షేత్రంలో కృషి అధికతరం చేయాలని అనుకుంటున్నాము. అక్కడ కార్యనిర్వహణకోసము ఈ సంవత్సరము పెద్ద ఎత్తున నిధి సేకరణ ప్రయత్నము చేస్తున్నాము. అందువల్ల ఎక్కువమంది కార్యకర్తలను పంపగలుగుతాము. ప్రస్తుతము 400 మంది పూర్తి సమయమిచ్చి పనిచేసే కార్యకర్తలున్నారు. ఆ సంఖ్యను 600 కు పెంచే ప్రయత్నము చేస్తున్నాము. మరొక వైపు విదేశీ మిషనరీలు, విదేశీ ద్రవ్యము భారతదేశంలోనికి రానీ కుండ చేయడానికి విశ్వహిందూ పరిషత్, ఇతర సంస్థలద్వారా ప్రభుత్వము మీద ఒత్తిడి తెచ్చే వాతావరణాన్ని క్రమక్రమంగా నిర్మిస్తు న్నాము. ఇక నాల్గవది బుద్ధి జీవులు. ఒక పరిమితమైన వర్గము. క్రైస్తవ ప్రచారకులు ఈ బుద్ధి జీవులవద్దకు రాకుండా ఇతరుల దగ్గర క్రైస్తవ మతం గొప్పదని హిందూ ధర్మములో లోపాలున్నాయని అన్నిచోట్ల ప్రచారము చేస్తుంటారు. అయితే మనము వానికి సమాధానము చెప్పకుండా ఊరుకుంటాము. వాళ్ళమతంలోని లోపాలను, బలహీనతలను ప్రజలకు వెల్లడి చేసే ఒక బుద్ధిజీవి వర్గము నిర్మాణం కావాలి. అధికార పత్రాల ద్వారా, పుస్తకాలు వ్రాయడంద్వారా, క్రైస్తవులు ప్రపంచమంతటిలో

ఎలా మోసము చేశారో తెలియజేయాలి. ఒకప్పుడు పోపు అధికారాన్ని వ్యతిరేకిస్తూ ప్రొటస్టెంటులు, ఆంగ్లికనులు, ప్రెస్బిటేరియనులు ఏ విధంగా నిలచారో, అదే ప్రకారము నేడు బుద్ధిజీవుల స్థాయిలో ఒక వర్గము నిలవాలి. ఈ నాలుగైదు విధాలుగా ప్రయత్నం చేయవలసి ఉంటుంది. శరీరంలో శరీరాహితానికి విరుద్ధంగా వ్యాపించేది **Cancer.** దానిని నివారించడానికి శస్త్ర చికిత్స, **X-రే, Deep X-ray,** ఇంకా అనేకవిధాలైన వ్యాధి నిర్మూలన ప్రయత్నాలు చేస్తాము. శరీరాన్ని కాపాడుతాము. లేకుంటే శరీరమే నశిస్తుంది. అదేవిధంగా సమాజం విషయంలోనూ చేయవలసి ఉంటుంది.

9. భారత్‌కు నలువైపులా శత్రు రాజ్యాలున్నాయి. ఒకవైపు పాకిస్తాన్, మరొకవైపు చైనా, వాళ్లకు సహాయంచేస్తూ అమెరికా, రష్యాలు ఉన్నాయి ఇవన్నీ భారత్‌ను అణచివేయాలని చూస్తున్నాయి. భారతీయు లకు ఇతర దేశాలలో ఓటు హక్కులేదు. కాని మనదేశంలో వాళ్ళకు ఆ హక్కు ఉన్నది. మనదేశంలో ఇతర మతస్థులు తమ యిష్టానుసారము అన్ని పనులు చేసుకోవచ్చు. ఈ విధంగా జరుగుతూపోతే, ఈ దేశంలో వాళ్ళ ప్రభుత్వము వచ్చే ప్రమాదమున్నది. దీనిని ఏ విధంగా తొలగించ గలము? ఈ విషయంలో మీ అభిప్రాయాలు తెలియజేయగోరుతున్నాను.

సమాధానము : దేశానికి కలిగే ప్రమాదాలన్నిటినుండి నివృత్తి కోసము సంఘం పనిచేస్తుంది. ఆ నివృత్తికి ఏకైక మార్గం ఈ దేశంలోని సమాజము శక్తిశాలి కావడము. ప్రతిక్షణము శరీరాన్ని నలువైపులనుండి ఎన్నో రోగక్రిములు చుట్టుముట్టుతూనే ఉంటాయి. మలేరియా, ఇన్‌ఫ్లూ యెంజా, టైఫాయిడ్, క్షయ వగైరా అయితే ఏ శరీరంలో అంతరిక శక్తి ఉంటుందో అది నిలువగలుగుతుంది. దుర్బలమైన శరీరము ఏదో ఒక

రోగానికి గురి అవుతూనే ఉంటుంది. భారతదేశానికి నలువైపులా శత్రువు లున్నారనడం క్రొత్త విషయమేమీ కాదు. ప్రతివారికీ చుట్టుప్రక్కల శత్రువులుండనే ఉంటారు. నలువైపులా మిత్రులెవ్వరికీ ఉండరు. మరి, మన మిత్రుడెవరు? మనలోని ఆంతరికశక్తియే. హిందూ సమాజానికి ఈ దేశానికిగల సంబంధము అవిచ్ఛిన్నము. ఈ దేశం తప్ప హిందూ సమాజానికి ప్రపంచంలో మరేదేశమూ లేదు. ఈ దేశానికి హిందుసమాజం తప్ప మరే ప్రాపులేదు. అందుచేత హిందు సమాజాన్ని సంఘటితపరచి, వారిలో దేశభక్తి మేల్కొలిపి, ఈ దేశాన్ని బలశాలిగా చేసినప్పుడు ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానము చెప్పగలుగుతాము. మనదేశము చిన్నదేమీ కాదు. జనసంఖ్య తక్కువ కాదు. సాధనసంపత్తులు తక్కువ కాదు. తెలివితేటలకు కొదువలేదు. ఇక పాకిస్తాన్‌వంటి చిన్నచిన్న దేశాలు ఏమిచేయగలుగుతాయి? సంకట పరిస్థితులను అధిగమించేందుకు ఈ దేశాన్ని బలిశాలిగా చేయడము అనగా హిందూ సమాజాన్ని సుసంఘటితం చేయడం ఒక్కటే మార్గము. ఆ మార్గాన్ని సంఘం స్వీకరించింది. ఈ విశ్వాసంతో మరింతగా పరిశ్రమిద్దాము.

మహమ్మదీయులకు ఓటుహక్కు అనేది రాజకీయ విషయము. ఇప్పుడు దానిని ఒక్కసారిగా 'వీలులేదు' అని అనలేము. మన రాజ్యాంగం ఈ దేశంలోని పౌరులందరికీ ఓటు హక్కు ఇచ్చింది కాని, మున్ముందు దేశానికి విరుద్ధంగా మాట్లాడే వాళ్ళకు - జనవరి 26, రిపబ్లిక్ దినోత్సవాన్ని వ్యతిరేకించిన వాళ్ళకు - ఓటు వేసే హక్కు లేదని చట్టము చేయవచ్చు. ఈ ఆలోచనా విధానాన్ని ప్రసారం చేయడం ద్వారా అటువంటి వారికి ఓటుహక్కు రద్దు చేయబడవచ్చు. మహమ్మదీయులందరికీ ఓటువేసే అధికారము ఉండబోదని సూటిగా ఈనాడు చెప్పలేము కాని, కొన్ని షరతులు ఆధారంగా-ఎవరు తాము ప్రథమంగా భారతీయులమని భావించరో,

ఎవరు తాము ప్రథమంగా ముస్లిములము తర్వాతనే భారతీయులమని చెబుతారో - అటువంటివారికి హిందుస్థాన్‌లో ముందుముందు ఓటుహక్కు లభించదు అని చెప్పవచ్చు. అయితే అది హిందూ సమాజము బలశాలి అయినప్పుడు మాత్రమే సాధ్యము.

10. సంఘ కార్యక్రమములో పథ సంచలనము - **Drill**- ఒక భాగము. దాని లక్ష్యమేమిటి? అది హిందువుల యుద్ధకండూతి భావన (**Militarism**) యొక్క ప్రదర్శన మాత్రమే అని పత్రికలు వ్రాస్తు న్నాయి. ఇందులో నిజమేమిటి?

సమాధానము : డ్రిల్లువలన, పథ సంచలనము వలన, గణవేషము వలన, ఐక్యతాభావన కలుగుతుంది. గణవేషము వేసుకున్నపుడు ఒకరి నుండి మరొకరిని గుర్తించడము కష్టము, అందరూ ఒకలాగే కనపడు తారు. అందుచేత ఇంగ్లీషులో సమానం చేయడానికి పేరు **Uni-form** అందరూ ఒకే రూపాన్ని పొందడము. కొందరి అడుగులు చిన్నవి మరి కొందరి అడుగులు పెద్దవిగా ఉంటే, అందరి అడుగులు ఒకే విధంగా ఉండే టట్లు, కొందరు వేగంగా, మరికొందరు మెల్లగా నడవకుండా ఒకే వేగంతో నడిచేటట్లు, తమలో పరివర్తన తెచ్చుకోవలసి ఉంటుంది. ఇది అందరితో కలవడానికీ, అందరితో సామంజస్యము పొందడానికి ఒక పద్ధతి. క్రమ శిక్షణ నేర్పబడే ప్రతిచోట ప్రచలన చేయడం, డ్రిల్లు చేయడం ముఖ్యమైన అంశాలు. **N.C.C.** స్కూలు, కాలేజీ, సాయుధ దళాలు, పోలీసు-వీళ్ళం దరిచేత ఇందుకోసమే డ్రిల్లు చేయించడం జరుగుతుంది. క్రమశిక్షణ రావడం దీని ముఖ్యఉద్దేశము. మధ్యమధ్యలో మనమెంతవరకు నేర్చు కున్నామో ప్రదర్శించాలనే కుతూహలం కలగడం సహజము. మనము ఎంతచక్కగా పాటపాడడం నేర్చుకున్నామో ప్రజానీకము ముందు ప్రద

ర్శించాలనే కోరిక కలుగుతుంది. ఆ విధంగాచూస్తే ప్రతిగాయకుడూ, నర్త కుడూ చేసేది తన సామర్థ్యాన్ని ప్రదర్శించడం మాత్రమే ఒకవ్యక్తి సాధారణంగా నడిచేటప్పటికంటె, పథసంచలనంలో వెళ్ళేటప్పుడు, అనే కులు తన్ను చూస్తుంటారు గనక పసందాగా నడుస్తాడు. దానితోపాటే, హిందూసమాజానికి తనలో సంఘటిత సామర్థ్యము కొంత ఉన్నదనే విష యము అనుభవంలోకి వస్తుంది. దీనివల్ల సమాజంలో ధైర్యము పెరుగు తుంది. సమాజంలో రెండు రకాలైన వ్యక్తులు దుష్టులు, సాధువులు ఉంటుం టారు. దీనివల్ల మంచివారికి ధైర్యము పెరుగుతుంది దుష్టులకు ధైర్యము సన్నగిల్లుతుంది. భగవంతునియొక్క పని యేమిటో గీతలో ఇలా చెప్ప బడి ఉన్నది:

"పరిత్రాణాయ సాధూనాం,వినాశాయ చదుష్కృతాం" మంచివారికి సమర్థన, రక్షణ కల్పించడము-చెడ్డవారిని శిక్షించి చక్కజేయడం-ఇటు వంటి పథసంచలన కార్యక్రమాలవల్ల ఆ రెండు ప్రయోజనాలు సిద్ధి స్తాయి. ఇది యుద్ధకండూతి భావనా ప్రదర్శన అనడం సబబుకాదు. ఇది ముందుకు చొచ్చుకుపోయే, భీరుత్వాన్ని విడనాడే లక్షణం-దుర్మార్గాన్ని ఎదుర్కొనే మనస్తత్వం. హిందువులలో అసలు ఊపిరే లేదని, తమ భావాలను గట్టిగా స్పష్టంగా చెప్పగల ధైర్యం లేదని, ఏమాటకు సమా ధానం చెప్పరని నేడు సమాజంలో ఉన్న భావన. కొంతవరకు అది నిజం కూడ. ఈ పథ సంచలన కార్యక్రమం హిందువు దుర్మార్గాన్ని ఎదు ర్కొంటూ, తన భావాలను నిర్మొహమాటంగా చెప్పే లక్షణాలను (agg-ress and assertive) ప్రదర్శిస్తుంది.

ఇంకా అనేక విషయాలను దృష్టిలో ఉంచుకొని మనము పథసంచల నములు చేస్తుంటాము.

## 11. శ్రీలంకలోని తమిళుల సమస్యపై సంఘ ఉద్దేశ్యమేమిటి?

ఈ విషయంలో సంఘ అభిప్రాయము నాగపూర్‌లో జరిగిన మన అఖిల భారతీయ ప్రతినిధి సభలలో స్పష్టము చేయబడింది. అందులో ఆమోదించిన తీర్మానాన్ని చదివితే ఈ విషయము తెలుస్తుంది. తమిళులకు వేరే రాజ్యాన్ని ఏర్పాటు చేయడం మనము సమర్థించము. దీన్ని సమర్థిస్తే, ఖలిస్తాన్ నిర్మాణాన్ని కూడ అంగీకరించవలసి ఉంటుంది. మాకు వేరే రాజ్యము కావాలని ఎవరు చెప్పినా, అది సమర్థనీయం కాదు. అయితే తమిళ ప్రజలు తమ భాషా సంస్కృతులను సగౌరవంగా, సురక్షితంగా ఉంచుకుంటూ, ఇతరులతో సరిసమానంగా, సమాన గౌరవ ప్రతిపత్తులతో జీవించవలసి యున్నది. ఈ విషయాన్ని సమర్థిస్తాము. ఇందులో మన కేంద్ర ప్రభుత్వము మాత్రమే కల్పించుకోగలుగుతుంది. అయితే ఇక్కడ విదేశ ప్రభుత్వ జోక్యము అనే మాట వస్తుంది. కాని, మన ప్రభుత్వము మూగ ప్రేక్షకుడిగా ఉండిపోరాదు. తటస్థంగా, శాంతంగా కూర్చుండి పోవడం కుదరదు. అది ఇటు తమిళులకు, అటు శ్రీలంక ప్రభుత్వానికి నచ్చచెప్పాలి. (ఒకరొకరి పట్ల మీ మీ భావనలు తప్పు). శ్రీలంక సైనికులు వెళ్ళి అమాయక ప్రజలను చంపడం తప్పు! అలాగే ఉగ్రవాదులు వెళ్ళి అమాయక ప్రజలను చంపడం కూడ తప్పే. భారత ప్రభుత్వం ఈ విషయంలో ప్రముఖమైన పాత్ర నిర్వహించాలని మన ఉద్దేశము. దురదృష్ట మేమిటంటే, రెండు వైపులనుండి కూడ మంచి మార్పులు రావడం లేదు.

తమిళ ఉగ్రవాదులు భారత ప్రభుత్వ వ్యక్తులతో "మాకు మీ సహాయము అక్కరలేదు. మేమే పరిస్థితులను సరిచేస్తాము. శ్రీలంక ప్రభుత్వానికి ఏమాత్రము శక్తి లేదు. కొద్ది రోజుల్లో అది కూలిపోతుంది. మేము

మా రాజ్యాన్ని స్థాపిస్తాము" అన్నారు. ఈ మధ్య వాళ్ళు విమానము కూడ తయారు చేసారని మీరు వినియుండవచ్చు. వాళ్ళకు కార్ఖానాలున్నాయి. కమ్యూనిష్టు దేశాలనుండి వారు సహాయం పొందుతూ ఉన్నారు. క్యూబా, చైనాల మద్దతు ఉన్నందున పోరాటం కొనసాగిస్తున్నారు. ఇరు పక్షాలకూ మానవతా దృక్పథము ఉండాలి. మార్గము శాంతి సంభాషణల ద్వారా మాత్రమే ఏర్పడుతుంది గాని, ఉగ్రవాదంతో ఏనాటికీ కాదు. భారత ప్రభుత్వము మధ్యవర్తిగా దృఢంగా నిలిచి వారి మధ్య గల సమస్యల తీర్మానము చేసి రాజీ కుదర్చాలి. తమిళులకు సమ్మాన పూర్వకమైన జీవితము లభించాలని మనము చెప్పాలి. ఉద్యోగాల విషయంలో ఎటువంటి పక్షపాతము చూపరాదు. వారికొక చిన్న ప్రత్యేక రాజ్యము ఉండాలనే విషయాన్ని సమర్థించము.

